శ్రీగురవేనమః.

# బ్రహ్మజ్ఞానచంద్రోదయము

3792

అను

శత్రుంజయమహారాజుకథ.

164

ఇది

పోకల - శేషాచలమునాయనివారి

పుత్రుండగు

పోకల- వేంకటనరసింహారావునాయనిచే

రచియింపఁబడి.




మద్రాసు.

హానలాక్ ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపంబడియె.

౧౦౦౦, కాపీలు.

1898



దీనివెల ౬ అణాలు.] [Price 6 As.

శ్రీగురవేనమః.

## విషయసూచిక.

---

నారాయణశర్మ-శత్రుంజయమహారాజునకుం జెప్పిన


౧. ధర్మపద్ధతి ... ... ... ... ... ౭
౨. అర్థపద్ధతి ... ... ... ... ... ౧౦
౩. కామపద్ధతి. ... ... ... ... ... ౧౨


ముద్గలమహాఋషి-శత్రుంజయమహారాజునకుబోధించిన


౧. మోక్షమార్గమగుయోగపద్ధతి... ... ... ౨౦
౨. భక్తిలక్షణము... ... ... ... ... ౨౪
౩. అష్టాంగములలోని-యమలక్షణము ... ... ౨౬
౪. నియమలక్షణము ... ... ... ... ౨౭
౫. ఆసనలక్షణము ... ... ... ... ౩౦
౬. ప్రాణాయామలక్షణము ... ... ... ౩౧
౭. ప్రత్యాహారలక్షణము... ... ... ... ౩౨
౮. ధ్యానధారణసమాధిలక్షణములు ... ... ౩౩
౯. రాజయోగ-సాంఖ్యయోగలక్షణము... ... ౩౬
౧౦. స్థూలపంచీకరణ-లక్షణము... ... ... ౩౭
౧౧. సూక్ష్మపంచీకరణ-లక్షణము... ... ... ౩౮
౧౨ కారణపంచీకరణ-తారకయోగలక్షణములు ... ౩౯
౧౩. అమనస్కలక్షణము... ... ... ... ౪౫
౧౪. పంచముద్రలలక్షణములు...... ... ... ౪౭
౧౫. విజయకేతుమహారాజుచరిత్రము ... ... ౪౮
౧౬. సచ్చిదానందలక్షణము ... ... ... ౫౫
౧౭. హరిపూర్ణభావము ... ... ... ... ౫౮
౧౮. దృఢచిత్తుండనుజ్ఞానిసందేహించినకథ. ... ౬౧
౧౯. శత్రుంజయమహారాజు-అవలికథ ... ... ౭౪

# ప్రకటన.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | సుజ్ఞానదీపమనుగురుగీత టీకాతాత్పర్యసహితము | 1 | 4 | 0 |
| 2 | శ్రీశివరామదీక్షితీయము-అచలగ్రంథం | 1 | 0 | 0 |
| 3 | శ్రీకృష్ణబోధామృతం 12 రాజులకథలు గ్లేజు | 1 | 0 | 0 |
| 4 | శ్రీకృష్ణబోధామృతం12రాజులకథలురఫ్ కాగితం | 0 | 12 | 0 |
| 5 | అరవభాషకృష్ణబోధామృతం12రాజులకథలు | 0 | 12 | 0 |
| 6 | శుద్ధనిర్గుణతత్వకందార్థదరువులు తాత్పర్యం | 0 | 12 | 0 |
| 7 | అష్టావక్రగీతాశాస్త్రము తాత్పర్యం | 0 | 10 | 0 |
| 8 | జనకసులభాసంవాదంప్రశ్నోత్తరరత్నమాల | 0 | 8 | 0 |
| 9 | జడభరతోపాఖ్యానం-వచనకావ్యం | 0 | 8 | 0 |
| 10 | ముక్తిప్రదాయిని గురుశిష్యసంవాదం | 0 | 8 | 0 |
| 11 | షట్చక్రవర్తుల, యింద్రజాలపుకథలు | 0 | 8 | 0 |
| 12 | వసిష్ఠజనకసంవాదము అతీతమార్గము | 0 | 8 | 0 |
| 13 | శ్రీకృష్ణోద్ధవసంవాదమనుపరమపదమార్గము | 0 | 8 | 0 |
| 14 | అరవభాష పరమపదమార్గము ... | 0 | 6 | 0 |
| 15 | ఉపనిషత్సార రత్నావళి... ... | 0 | 8 | 0 |
| 16 | శుకపంచవింశతియను 25 చిలుకచెప్పినకథలు | 0 | 8 | 0 |
| 17 | భక్తవిజయమను ౧౦ మహాపతివ్రతకథలు | 0 | 6 | 0 |
| 18 | అరవభాషభక్తవిజయము మహాపతివ్రతకథలు | 0 | 6 | 0 |
| 19 | సుజ్ఞానరత్నావళియను వేదాంతకీర్తనలు | 0 | 6 | 0 |
| 20 | శ్రీకృష్ణనృగమహారాజుసంవాదం శుద్ధనిరాలంబం | 0 | 4 | 0 |
| 21 | ఉషాపరిణయము శృంగారవచనకావ్యం | 0 | 4 | 0 |
| 22 | ఆంధ్రపంచీకరణం సాంఖ్యసూత్రం | 0 | 2 | 0 |

ఈగ్రంథములును మఱికొన్నిగ్రంథములును వేదాంత విషయంబులై, రిజిస్టరుచేయఁబడి మద్రాసు నాటుపిళ్లారిగుడి వీధి కవాటసంఖ్య ౨౦గల మందిరంబునవిక్రయింపంబడును. రు౧౦లకుపైగాకొను వర్తకులకురు౧కమీషన్ యివ్వబడును. తక్కినవారికికమీషన్ యివ్వబడదు. వి. పి. గాఁబంపఁబడును.

పోకల-శేషాచలమునాయఁడు గ్రంథకర్త.



అచలగురుఁడు-పోకల శేషాచలమునాయఁడు.

శ్రీగురవేనమః.

# బ్రహ్మజ్ఞాన చంద్రోదయంబను

# శత్రుంజయ మహారాజు కథ.

ఉ॥ శ్రీగురుమూర్తి నవ్యయుని జిన్మయు నిర్గుణు నంతరాత్ముని।
న్నాగమవేద్యుఁ బూర్ణు భవనాశనకారకు ముక్తిదాయకున్।
యోగసమాధితత్పరు నిజోజ్జ్యోతిమయాత్ము నిర్వికల్పునిన్।
రాగిలు భక్తి నెక్కొనగ నిరంతరమున్ భజియింతు నెమ్మదిన్॥

శ్రీమద్వేదాంతాచలనిత్యసత్య పరిపూర్ణాఖండస్వరూపులును, ద్వయదోషరహితులునునగు పోకల శేషాచలమునాయనివారికిఁ బుత్రుండును, నంతేవాసియు, వేంకటనరసింహానామధేయుండును, నగు నేనాత్మారామబ్రహ్మంబు నిష్టదైవతంబుగాఁదలంచి వ్యాసమహామునింబొగడి తద్విరచితభారతాంతర్గతశాంతిపర్వంబునఁ గర్ణుని వియోగంబునకై దుఃఖించు ధర్మజునకు దేవస్థానుండను మునీంద్రుఁడుహితోపదేశంబుఁ జేసెనను, నంశంబుఁగొని మత్ప్రీతిభావిశేషంబున నచ్చోనొక కథనుగల్పించి తత్త్వవిచారంబుపొందుపడ వచనపఙ్క్తిని వ్రాయంబూనిన బ్రహ్మజ్ఞాన చంద్రోదయంబను శత్రుంజయమహారాజు చరిత్రంబునకుం గథా క్రమం బెట్టిదనిన.

శ్రీమదవనీకాంతకు మేఖలయనం దనర్చు హస్తి

నాపురంబును బాలించెడు నజాతశత్రుండగు ధర్మ రాజు నిజభుజదండదండిత వైరికులమండలుండగు భీమసేనుండును, శరవిద్యాకుశలుండగు గాండీవియు, నతులతేజోభిరాములగు కవలునుగొలువఁ బతివ్రతాశిరోమణియగు ద్రౌపదీదేవి తన్ను సేవింప, నంతకుఁబూర్వము సోదరులసాహాయ్యంబునఁ జెకాడినబంధుమిత్రులకు నుదకకర్మంబులాచరించి, శుచిర్భూతులగుపొంటె, ధృతరాష్ట్రవిదురసహితంబుగ సకల కౌరవులును గంగాకూలంకష కూలంబున కేతెంచి, యట పటకుటీరములు వేయించియుండ, నచ్చటికి నారదకృష్ణద్వైపాయనకణ్వదేవస్థానాది మహర్షులు శిష్యవర్గంబులతోడ ధర్మనందను సందర్శనార్థంబరుదేర, నాపాండవాగ్రజుండు వారిని సమర్యాదంబుగ గారవించి, శ్రీకృష్ణసాత్యకాద్యాదియాదవులతోడఁ బ్రియంబులువలుకుచుఁ, దనతల్లి చేఁగర్ణుండగ్రజుండని విన్నసంగతి నుగ్గడించి దుఃఖించుచుండ, నర్జునాదులు తద్దుఃఖోపశమనంబుసేసియు విననొల్లక, రాజ్యసుఖంబు మిగుల తుచ్ఛంబనియెంచి యడవులకుంబోవ సమకట్టిన నట్టియెడ దేవస్థానుండను మునీంద్రుండు ధర్మజుంజూచి, కుంతీనందనా, తొల్లిముద్గలుండను మహాఋషి శత్రుంజయుండను మహారాజునకు బోధించిన బ్రహ్మజ్ఞాన చంద్రోదయంబనునొకయితిహాసంబుగలదు, దానివి

నిపించెద సావధానచిత్తుండవై వినుమనియిట్లనియె.

శ్రీమించు నీభరతఖండంబునఁ గర్ణాటకంబననొ క్క దేశంబుగలదు. అందుఁగల సింగారపుఁ దోఁటల సొంపును, బంగరపుటుప్పరిగెలపొడవును, నింపగు కమ్మని వాసనలీను తెరువులసొబగును, ముత్తెపుగ్రుమ్ముల సోయగంబును, బచ్చలతోరణంబుల బెడంగును, మిన్నంటియుండు పొన్మేడలచందంబును గొండాడ నేరికిం దరముగాదు. ఆదేశంబును సత్యజిన్మహారాజు ధర్మమును నాల్గుపాదములయందును నడిపించు చు, "రాజాప్రకృతిరంజనా" త్తనువాక్యంబు సార్థంబుగాఁ బౌరులను సంతోషపెట్టుచుఁ బెద్దలం బూజించుచు, దుష్టులశిక్షింపుచుఁ బ్రజలయెడఁ గరుణగలిగి పాలించుచుండెను. అతనిభార్యయగు చంద్రముఖియుఁదనభర్తయే తనపాలిటిదైవంబుగ నెంచి పాతివ్రత్య ధర్మంబూనియుండెను. ఇట్లుండ నొకనాఁడా కాంతాలలామతనభర్తంగాంచి, ప్రాణ నాథా, మనరాజ్యంబు ధర్మదేవతకు నాలయంబు. మునిగణంబులకు నాటపట్టు. ఇందిరాశుభాంగికి నిల యంబు. మనమంత్రియు నాసత్యకీర్తియుంబోలెమి మ్ములను మీరాజ్యంబును గాపాడుచుండువాఁడు. ఆధర్మనీతి తనదన్వయంబుసార్థంబుగా ననేకధర్మం బులాచరించుచు, న్యాయశాస్త్రంబు ననుసరించు చుఁ గంటికిఱెప్పవలె మెలఁగువాఁడు. మనకిన్నిసం

పదలుండియుఁ బుత్రసంపద లేదనుగొఱఁత యొక్క
టియనాయంతరంగంబునఁ జింతనందించెదు. "అపు
త్రస్యగతిర్నాస్తి" యనువాక్యముచేఁ బుత్రులులే
నివారికి స్వర్గాదిభోగంబులులేవని దేవరవారు విన
లేదా? పూర్వము షట్చక్రవర్తులును, షోడశమహా
రాజులును స్వర్గముంగోరియకాదె రాజసూయాశ్వ
మేధాద్యధ్వరసంజాతంబులు పెక్కులొనర్చిరి. మ
ఱియు దశరథమహారాజు పుత్రకాంక్షచేఁ బుత్ర
కామేష్టి నొనరించి, శ్రీరామచంద్రుఁడాది సుతులం
బడసె. మీరును నాయాగంబుఁదలపెట్టి తత్ఫలం
బునఁ బుత్రుంబడసినం బాగుండుననిన, నాతండు
నట్లకాకయని బ్రహ్మజ్ఞానులగు భూసురులను మహా
మునులనురావించి వారికిఁ దనయభిప్రాయంబునె
ఱింగింప, వారిలోఁగ్రతువను మహర్షి రాజుంజూచి,
'ధరణీశోత్తమా, నీకీవిచారమేల? నీభార్యగర్భంబున
మహాయోగ సంపన్నుండును, జితేంద్రియుండును
నగుపుత్రుండొక్కరుండుదయించును. నీవు పుత్ర
కామేష్టియాగం బొనరించునవసరంబేమియు లేద'
నవుఁడు నారాజేంద్రుఁడు నాతనికి నమస్కరించి
యందఱఁదమ నివాసంబులకుఁ బోవంబనిచి తాన
నేక ధర్మంబులాచరించుచు, నిజగురుండగు భర
ద్వాజ మహాఋషివలన నెఱింగిన సాంఖ్యయోగం
బును, దేహిదేహలక్షణంబులను నప్పటప్పటికిజ్ఞప్తి

కించెచ్చుకొనుచుఁ బెద్దలఁబూజించుచునుండఁ గొద్ది దినంబులకు నాచంద్రముఖికి గర్భంబునిలిచిన నా నరేంద్రుఁడు సంతసించి, యారవమాసంబునఁ బుంసవనంబును, నెనిమిదవ నెలను సీమంతంబును నొనరించిన, నా కాంతనవమాసంబులు గర్భంబుధరించి, పదియవ నెలయందునవమన్మథరూపుండగుకొమరునింబడసిన, నాభూకాంతుండుసంతసంబంది కోట్లకొలఁది ధనమును సత్పాత్రులకుఁ బంచిపెట్టి, గోభూహిరణ్యాది దానంబులనేకంబులుగావించి, పదియవ దివసంబునఁ బుణ్యాహవాచనంబు సేయించి, జాతకర్మాదిక్రియలొనరించి, శత్రుంజయుండను నామకరణమహోత్సవమునుగావించి, యతిగారాబముతోఁ బెంచుచు నైదవయేట విద్యాభ్యాసంబు సేయింపం దలంచిన, నాచంద్రముఖి యాబిడ్డను నిమిషకాలంబైనం బాయని దొడ్డమోహంబునఁ బాఠశాలకుంబంప నొప్పకుండె. అట్టియెడ నాసత్యజిన్మహారాజు తనప్రియభార్యంజూచి, ప్రాణనాయకీ,

శ్లోకం॥ హర్తుర్యాతినగోచరంకిమపిశంపుష్ణాతియత్సర్వదా। వ్యర్థిభ్యఃప్రతిపాద్యమానమనిశంప్రాప్నోతివృద్ధింపరామ్। కల్పాంతేష్వకినప్రయాతివిధనంవిద్యాఖ్యమంతర్ధనం। యేషాంతాన్ప్రతిమానముజ్ఝితన పాఃక స్తైస్సహాన్స్పర్థతే॥ అని యున్నది గనుక పశ్యతోహరులకుఁ జూడ శక్యముగానిది

యును, నెల్లప్పుడు సుఖమును గలుగఁజేయునది యును, మంచియశస్సును దెచ్చునదియును నొరులకిచ్చుటచే తనను పోలికఁదగ్గనిదియును, మావంటిరాజులు సయితము గౌరవింపఁదగినదియును నగు విద్య మిక్కిలియుత్కృష్టమైనది. అదిలేని యెడల "విద్యావిహీనఃపశుః" అనువాక్యమునుంబట్టి మనుజుఁడు పశుప్రాయుండగుచున్నాఁడు. కావున మనపుత్రునకు విద్యాభ్యాసముఁ జేయింపవలయునననిన, నాలతాంగియును సమ్మతించి మీయిష్టానుసారముగ నడిపింపుఁడని చెప్పిన, నారాజేంద్రుఁడు సమస్తనీతిశాస్త్ర కోవిదుండగు నారాయణశర్మయను విప్రోత్తమునింబిలిపించి, యోపండితోత్తమా, నాపుత్రుని విద్యావంతునిగాఁజేయుఁడని యొప్పగించెను. ఆనారాయణశర్మ ప్రభువునుంగాంచి, రాజేంద్రా, నేనశస్త్రశస్త్రవిద్యలందఱకుఁ దక్కినవాని నేర్పెదనని పలికి సెలవుపుచ్చుకొనిపోయెను. అంతనా భూపాలుఁడు ఖురళీశాల నొక్కటిఁగట్టించి యందుసకలశస్త్రింబుల నమర్చి వీరవర్మ యను క్షత్రియుని గురునిగా నిల్పి సామును, గరడియును, ధనుర్విద్యయును గఱపించుచుండెను. ఇట్లాశత్రుంజయుండు పదునాలుగువత్సరంబులలో నెల్లవిద్యలనేర్చి, బుద్ధికుశలతయును, జాకచక్యమునుగలవాఁడు గనుక, నొక్కనాఁడు నిజ

గురుండగు నారాయణశర్మకు నమస్కరించి, "గురువర్యా, నాకన్నివిద్యలంగఱపితిరి. ఇంకను నాకొక్క కోరికగలదు సెలవిచ్చినం జెప్పెద" ననిన, నాగురుండు "రాజకుమారా, భయపడక యడుగవలసినదానినడుగుము నాకుందెలిసినంతమట్టుకుం జెప్పెద" నావుడునాబాలరాజిట్లనియె. "స్వామీ! పురుషార్థంబులనేమి? అందుశ్రేష్ఠంబెద్ది? కరుణతో నాకెఱింగింపు" డనిన, నాగురుం డానందరసభరితుండై యాశత్రుంజయునింజూచి, "నీప్రశ్నలు నాకు నానందజనకంబులైనవి నీవడిగినపురుషార్థంబులు ధర్మార్థకామ మోక్షంబులని నాలుగు విధములు. అందు మోక్షమనునది మహాజ్ఞాన పురుషులగు మునీంద్రులచేఁ దెలియఁదగ్గది. ధర్మార్థ కామంబులను త్రివర్గంబు నీకెఱింగించెద. శ్రద్ధానక్తుండవై విను" మనియిట్లనియె.

నారాయణశర్మ - శత్రుంజయునకెఱింగించిన ధర్మపద్ధతి.

రాజాత్మజా! ధర్మము సమస్తసంపదల నొడఁగూర్చును. ఇంద్రలోకసుఖంబుల ననుభవింపంజేయును. కీర్తియును బుణ్యంబును గలిగించును. అట్టి ధర్మస్వరూప మగు దానమునుజేయక పోవుటచేత దారిద్ర్యమును, దానిచేతఁ బాపకార్యంబులఁ జేయు బుద్ధియును, దాన నరకంబునుగలుగును. "శ్లో॥ అని

త్యానిశరీరాణి విభవోనైవశాశ్వతః । నిత్యంసన్నిహితోమృత్యుః కర్తవ్యోధర్మసంగ్రహః" అని యున్నది గనుక నీశరీరంబును, సంపదలును నిత్యంబులుగావు, మృత్యుదేవతయు సమీపించి కాచియున్నయది. కావున ధర్మంబునే యాశ్రయింపవలయు. పిపీలికాది జంతువర్గంబు సైతము తాముగడించిన యెరలోఁ గొంత తమజాతిజంతువులకు దానముసేయుచుండఁగా, వివేకవంతులగు మానవులేలచేయరాదు? మఱియు నీధర్మంబు సత్పాత్రులగు బ్రహ్మజ్ఞాన తత్పరులైనవారికిం జేయుటచే దాత [illegible] విధంబులు. అందుఁ బశుయాగ వైశ్యదేవబలిహరణాది యాగంబు లిష్టంబులు-వాపీకూపతటాకదేవాలయాది నిర్మాణంబులు పూర్తంబులు. అనినవిని రాజనందనుండా భూసురునకునమస్కరించి" గురువరా, ధర్మపద్ధతి చక్కఁగాఁదెలిసెను. ఇంకనర్థపద్ధతినెఱింగింపుఁ" డనిన నతండిట్లనియె.

నారాయణశర్మ - శత్రుంజయమహారాజునకుం

జెప్పిన- అర్థపద్ధతి.

అర్థమనఁగా=ధనము. ఈధనము సర్వకార్యంబులకును మూలంబు " శ్లో॥ యస్యాస్తివిత్తంసనరఃకులీన । స్సపండిత స్సశ్రుతవాన్గుణజ్ఞః । సఏవవక్తాసచదర్శనీయ । స్సర్వేగుణాఃకాంచన మాశ్ర

పాలనశక్తియును; వైశ్యుండు కృషిగోరక్షణ వాణిజ్యంబులను; శూద్రుండు బ్రహ్మవిదులసేవయు నోర్పును, శిల్పంబులును, సత్యంబును, మనోనిగ్రహంబును, శుచిత్వంబును గలిగియుండవలెను. మఱియును జనులకపకారంబెన్నక, దీనులరక్షించుటయు, సత్యమువల్కుటయు, నతిథిసత్కారంబును, కరుణారసంబును గలవారింద్రలోక సుఖంబులననుభవింతురనుటకు సందియంబులేదు. కఠినపుమాటలాడుటయు, నబద్ధములాడుటయు, నితరులద్రవ్యంబునపేక్షించుటయుఁ బరదారాగమనంబు సేయుట

సుతః కాంతాచనాలింగతే । అర్థప్రార్థనశోకార్తా నకురుతే సంతాప మాత్రంసుహృ । త్తస్మాదర్థము పార్జయశ్శ్రుణు సఖేహ్యర్థేన సర్వేవశాః॥ అనుటచే, ధనహీనుండగు వానినిఁ దల్లి నిందించును. తండ్రి చూచి సంతసింపఁడు. సోదరులును జక్కఁగా మాటలాడరు. సేవకుఁడును గోపగించును. సుతుండును దన్ననుసరించిరాఁడు. భార్యయునునాలింగనముచేయనొల్లదు. చెలికాఁడును ద్రవ్యంబడుగునను శంకచేఁ బలుకరించుకోనఁడు. ధనముగలిగియున్ననందఱు వశులగుదురు. కావున నేవిధముచేతనైనను ధనము నార్జింపవలయును. ధనము సమస్తసంపదలనొడఁగూర్చును. రాజులు ధనముగలిగియుండుట

చేతనేగదా రాజసూయాశ్వమేధాదియాగంబులు పెక్కులుగావించి, యాత్మసంతుష్టినొనరించి, స్వర్గంబున సుఖానందులైరి. ధనము సత్పాత్రులకు నిచ్చుటచేతనేగదా మితిలేని యనుభవమును, సుఖానందమును, మోక్షమునకుఁద్రోవయును గలుగును. ధనములేనిదరిద్రునకు నేయత్నములును ఫలించవు. కావునఁ బరద్రవ్యాపేక్షనుంబొందక నరుఁడు ధర్మయుక్తముగ నుద్యోగవ్యాపారాది వృత్తుల వలన ధనమును సంపాదించి, తానుననుభవించి, సత్పాత్రులైన పుణ్యులకు నిచ్చుటకర్తవ్యంబు. తానిచ్చినది స్వల్పమైనను నొకటికిఁ గోటిగాను వృద్ధిఁబొంది, యదితనకు ననుభవనీయమైయుండునని పెద్దలువల్కుదురు. కావునధనమార్జింపవలెనని చెప్పిన నారాజపుత్రుఁడు పరమానందంబునుంబొంది, గురునకునమస్కరించి, "స్వామీ, అర్థపద్ధతినిఁజక్కఁగా గ్రహించితి. ఇఁకఁగామపద్ధతి యెట్టిదో యెఱింగింపుఁడనిన," నారాయణశర్మ యిట్లనియె.

## నారాణశర్మ శత్రుంజయునకుంజెప్పిన కామపద్ధతి.

కామమనఁగా=కోరిక. అది లౌకికమనియును, మోక్షార్థంబనియును రెండువిధములు. అందు, సద్వస్తువుల ననుభవింప నపేక్షించుట, సమస్తసంపదలు రావలయుననికోరుట, మదనప్రేరితుండైన

యెడల, "శ్లోకం। మాలతీ శిరసిజృంభణం ముఖే చందనంవపుషికుంకుమావిలం । వక్షసిప్రియతమా మదాలసా స్వర్గఏష పరిశిష్టఆగమః॥ అనునట్లు కొప్పున జాజిపువ్వులదురిమి, యనురాగాదులు ముఖంబునందోప, వక్షంబున కుంకుమపువ్వతోఁగూడిన గంధంబునలంది, మిక్కిలి ప్రియముగలయలినీలాలకంగూడినఁ గదా స్వర్గలోకసుఖంబులనుభవించినట్లుండు" ననికోరుట లౌకికకామంబని చెప్పంబడును. ఈకామమనునది తక్కిన పురుషార్థంబులవలెఁగాక, ప్రత్యక్ష సుఖానుభవంబిచ్చునది. కాముకుఁడుగాని షండుఁడు సృష్టికివిరుద్ధుండుగాన, వానిజన్మంబు నిరర్థకంబండ్రు. మఱియు, "కామిగాక మోక్షకామిగాఁడు" అనులోకోక్తిననుసరించి, కామాదులఁ జక్కఁగా ననుభవించి,పిమ్మట వానియందువిరక్తిఁజెంది మోక్షాపేక్షపరులై పెద్దలనుసేవించి వారిచే దత్వవిచారంబు నరయవలయును. తొల్లింటికవులు. "శ్లో॥ స్తనౌమాంస గ్రంథీకనకకలశావిత్యుపమితౌ। ముఖంశ్లేష్మాగారం తదపిచ శశాంకేనతులితమ్ । స్రవన్మూత్రక్లిన్నంకరివరశిరస్పర్థిజఘనం । ముహుర్నింద్యంరూపంకవిజన విశేషైర్గురుకృతమ్॥" మాంసపిండంబులగు కుచంబులబంగరుకలశంబులనియుఁ, గఫాదులపుట్టినిల్లగుముఖంబును జంద్రబింబమనియు, మూత్ర

భాజనంబగు జఘనంబు మదజలాన్వితంబగు కుంభి కుంభంబులనియుఁ బెక్కువిధంబులఁ బిచ్చిపిచ్చిగా వర్ణించిరి. ఈకామాపేక్షచేతనే దేవేంద్రుండంతటి వాఁడు గౌతమముని సతియగు నహల్యంగోరి మే నెల్లయోనులగునట్లుగా శపింపంబడియె. రావణా సురుండును సీతాదేవింగోనిపోయి తుదకు శ్రీరామ చంద్రునిచేఁబుత్రమిత్రసహితంబుగమృతుండయ్యె. కావున నెట్టివాఁడును కామంబును విశేషింపం జేసి దానియందేమునిఁగియుండరాదు. మఱియు "శ్లో॥ తుంగంవేశ్మ సుతాస్సతా మభిమతాస్సంఖ్యాతిగా స్సంపదః । కల్యాణీదయితావయశ్చ నవమిత్యజ్ఞాన మూఢో జనః । మత్వావిశ్వమనశ్వరంనివశతేసంసా రకారాగృహే । సంధృశ్యక్షణభంగురంతదఖిలం ధన్యస్తు సన్న్యస్యతి॥" అనుశ్లోకము ననుసరించి, మూఢుండగుజనుండు లోకంబును, లోకంబునంగల గృహారామంబులను, సతీసుతులను శాశ్వతంబని నమ్మి మాయలోఁజిక్కువడి జననమరణాదులంబొం దుచుండును. మతిమంతుఁడగువాఁడు. "జగన్మి థ్యాబ్రహ్మసత్య" మ్మనువాక్యముచొప్పున నీజగం బును, నీజగముతోసంబంధించిన సమస్తమును డబ్బరయనియెంచి, సద్గురుముఖంబున సాంఖ్యవిచా రణంబుఁజేసి, దేహిదేహ లక్షణంబులనెఱింగి కా మంబునుఁ్రోసి మోక్షంబునొందును. కావున నిహ

సుఖంబులు మిగులతుచ్ఛంబులనియు నశాశ్వతంబులనియునుజెప్పిన, నారాజనందనుం డామహీసురు నవలోకించి, "గురువరా, మీచేఁజెప్పంబడినవర్గత్రయపద్ధతులను, వైరాగ్యధర్మంబును జక్కఁగాఁ దెలిసి కొంటిని. ఇకఁ మీఁదు మోక్షపద్ధతిననుసరించుట పరమధర్మం' బనిపలికి,యాగురునివలన సెలవుపొంది నిజగృహంబునకుం బోయెను.

అంతనారాజపుత్రుఁడుధనుర్గురునివలనదివ్యాస్త్రప్రయోగములన్నియునుగ్రహించి, "స్వామీ,గురువరా, నేర్చినవిద్యలను బ్రకటింపఁ జేయుటవలన గదా యిహలోకమందు ఖ్యాతియును, బరలోకంబున సుఖమునుగలుగును. నేనుయ్యావనదశయందే, దేశాటనంబుచేసి, సర్వదేశపద్ధతులెఱింగి, సద్గురు కటాక్షంబున మోక్షమార్గంబరసివచ్చెదను; సెలవిం" డనిపలికిన, నాగురుఁడతని నాలింగనముచేసి ముద్దుపెట్టుకొని, "బిడ్డా,నాగురుఁడిచ్చిన జితారిమత్తనుపేరుగలయొకచంద్రహాసంబుగలదు.ఇది సర్వశత్రువుల నాశనమొనరించును. దీనినీవుగైకొని నిర్భయముగాసంచరించి ర" మ్మనిదీవించి యిచ్చెను. అతఁడు దానిగ్రహించి సాష్టాంగపడి నమస్కరించి దీవనలువడసి సెలవుపొంది తన మేడకుంబోయి, మోక్షాపేక్ష దట్టముగాబాధించుటం జేసి కంటికి నిదురపట్టక, "ప్రియమైన జననీజనకులారా,నేనుదే

శాటనంబుచేసి సద్గురునికృపకుఁబాత్రుండనై వచ్చె దను. మీరు నావిషయమై దుఃఖింపక ధైర్యంబవ లంబించియుండుఁ'' డని యొకపత్రికనువ్రాసి యం దుంచి, ధనుర్బాణములనుధరియించి పంచకల్యాణి యను తన తురగమునెక్కి యుత్తరదిక్కునుం గూర్చిపోవుచుండెను.

ఇట సత్యజిన్మహారాజు పుత్రునింగానక యెట కేనిఁ బోయియుండునని యచ్చటఁ జుట్టుప్రక్కల వెదకించియుంగానమి దుఃఖించుచు, శత్రుంజయుని శయనగృహంబునకుంబోయి యందొకమందసము పైనుంచియున్న చీటినింగని యందలిసంగతుల నరసి, తనపుత్రుఁడు భూసంచారము సేయఁబోయె నని యెంచి దురంతచింతాక్రాంతయగు తనకాంత నవలోకించి, 'చంద్రముఖీ, దుఃఖము దుగుము. మన పుత్రుండు భూసంచారంబునకై పోయి యుండు వాఁడు. ఇదె యీవ్రాసినకమ్మనుజూడు'మనియిచ్చి యాకొమ్మనూరార్చి, వేగులవారింబంపి యాతని పోబడి నరయుచుండిరి.

అట శత్రుంజయుండు నిర్భయముగా దట్టము లైన యడవులంజొచ్చిపోవుచు, దుష్టమృగముల దునుముచుఁ, దన్నుఁజంపనుంకించు మదపుటేనుం గులఁ బీనుంగులుసేయుచు, ఖడ్గంబుల ఖడ్గంబులం ద్రుంచుచుఁ,గిటులంగీటడంచుచు, బెబ్బులులంబశ

ద్రోచ్చి కంఠంబుల ఛేదించుచు, నలయికఁ జెంది, వన్యఫలంబులభక్షించి తేఁట చల్లనినీరు ద్రావుచు, విహారంబులకై కొలఁకులలోదిగి కలువపూలఁగో యుచు, సెలయేళ్లప్రవాహములలోనీఁదుచు, నీప్ర కారముపోవుచు, ననేకదినంబులకు నొకమునిపల్లెం గని మనంబున సంతసించి తనకుం గనుపించిన వటులచే ముద్గలుండనుముని మిక్కిలి తపస్సంప న్నుండును, మహాజ్ఞానియునని యెఱింగి, యామహా నీయునిచెంత కరిగి యతనిపాదకమలంబులకు సా ష్టాంగ దండప్రణామంబులాచరించి నిలువంబడిన, నాతాపసోత్తముండతని దీవించి యాదరించి, యా తనివృత్తాంతంబు వినంగోరిన, నారాజపుత్రుండిట్ల నియె. "మునిసత్తమా, నేను గర్ణాటకంబు నేలు సత్యజిన్మహారాజుపుత్రుండను. నన్నుశత్రుంజయుం డందురు. ధర్మార్థకామంబులనుత్రివర్గంబును, నాదు విద్యాగురుండగు నారాయణశర్మచేనెఱింగితి. ఇహ లోకసుఖంబులు తుచ్ఛంబులనియెంచి, మోక్షాపే క్షుండనై మీవంటిపెద్దలదర్శింప నిటవచ్చితి. దీ ర్ఘవైరాగ్యంబును బూనినవాఁడను. నాయందుఁ గరుణించి మోక్షార్థంబుపదేశింపుఁడు." అనిన నా మునివరుండిట్లనియె. "రాజనందనా, నీప్రశ్నయమో ఘంబు. ఇందుఁగల యనేకమునులు సహితము తన్మో క్షంబుకొఱకై తలక్రిందుగాఁదప మొనర్చువారును,

బంచాగ్ని మధ్యమమునం గూర్చుండి సహస్రాబ్దులు సలుపువారును, వేసవిని బండఱాలపై నేకపాదంబు ననిలిచి హస్తంబుల నూర్ధ్వముఖంబుగా మోడ్చి యనేకదివ్యవర్షంబులు యోగముఁ జేయువారును, వర్షాకాలంబులఁ దటాకంబులఁ గుత్తుకబంటినిలిచి తపస్సును జేయువారును, ప్రాణంబులను బిగియం బట్టి నిక్కముక్కుతుదం జూచువారునునై యున్న వారు. నీవీకష్టంబుల కోర్వఁజాలవు. కావున నీవును నీ తాతదండ్రులవలె ననేకవత్సరంబులు ప్రజాపాలనంబుచేసి, రాజసూయాశ్వమేధాద్యధ్వరంబుల ననేకంబుల నొనరించి స్వర్గలోకసుఖంబుల ననుభవింపుము. శాశ్వతసుఖానందంబగు మోక్షంబు నీవంటి సుకుమారులకు నలవిగాదు. త్రివర్గంబు నెఱింగితి నంటివి. ఆదిదేవులగు నీతలిదండ్రుల దుఃఖభాజనులం జేసి యీయడవులకువచ్చి నీవేమిసాధించుటకో నేఁ జెప్పునట్లు మఱలి నీ దేశంబునకుం బోయి, దారాపుత్రాదులఁ బడసి, యనేకదినంబులు సుఖంబుల ననుభవించి పిమ్మట విరక్తుండవై వచ్చిన మోక్షమార్గంబు సాధింపనగు." అనవుడు నారాజనందనుండు మిక్కిలి దైన్యముంబొంది, కన్నుల బాష్పంబులు రుల నాబుషిశ్రేష్ఠునకు నమస్కరించి యాతనిపద కంజంబులఁ దన నేత్రజలంబులందుడిచి, "మహాత్మా, నే నెన్ని జన్మము లెత్తి యెన్నిమాఱులు త్రివర్గంబుఁ

తెలిసియుంటినో తెలియదు. ఎందఱుతల్లిదండ్రులుండిరో, యెఱుంగఁజాల. అన్నిఁటికి నుత్కృష్టంబగు నీమానవజన్మమెత్తి మోక్షంబునరయకున్న వాఁడు పుడుకకును గొఱగాఁడు. అట్టివానిని ద్విపాదపశువందురు. మీరెన్ని చెప్పినను నేనువినువాఁడనుగాను. నాతల్లిదండ్రులును, నారాజ్యమును, నాయనుభవంబులు నుదబ్బరలనియెంచియున్న నామనంబెబ్బంగి దిరుగనోపు? మీరునన్నుఁ గరుణింపకున్న మీపాదంబులపై నాప్రాణంబులవిడిచి స్వర్గంబుఁ బ్రాపింతు'ననిన నాముద్గలమహర్షి యాతనింగని, 'రాజకుమారా, నీసుకుమారతనువునకు, నీయోగమార్గంబులు కష్టసాధ్యంబులుగావని ముందేచెప్పి యుంటినిగదా? నీవట్టికోరికనువిడిచి నేఁజెప్పఁబోవు మణి మంత్రౌషధవశీకరంబుల నాలకింపుము. వానిచేనీకు సర్వజనవశీకరంబును, భూమండలనాయికత్వంబును గలుగు' ననిచెప్పిన, నాశత్రుంజయుండా మునీంద్రునకు నమస్కరించి, 'మహాత్మా, ఈలోకసుఖంబులఁ దుచ్ఛంబులుగాభావించి, సర్వమును ద్యజించి, నిత్యపదార్థంబగు బ్రహ్మసాక్షాత్కారంబును గోరివచ్చిన నాకు మాయాసమన్వితంబు లగునీ మంత్రతంత్రంబులు నిష్ప్రయోజనంబులు. కావున నాకు జ్ఞానమార్గంబునేబోధించు'మని పెక్కువిధంబులం బ్రార్థించిన, నామునీంద్రుండాతనిపై రా

గ్యంబునకు సంతసించి యాతని నాదరించి తత్వా ర్థంబులం దెలుపందొడంగె.




ముద్గలమహాఋషి, శత్రుంజయమహారాజునకుం
బోధించిన యోగపద్ధతి.

రాజాత్మజా, తొల్లి నీవిద్యాగురునిచే బడసిన ధర్మార్థకామంబులు లౌకికార్థంబులు. ధర్మమనఁ

గా వేదోక్తపువిధి. అనఁగా వేదస్వరూపుండగు నాత్మునియొక్క స్వరూప విచారణ. ఈధర్మంబు మానవసామాన్యలబ్ధంబుగాదు మోక్షాపేక్షుండగు మానవుండు బ్రహ్మసాక్షాత్కారమును బొందించెడు సద్గురూత్తముని యాజ్ఞనుల్లంఘింపక, యెల్లప్పుడు నతని సతీసుతులను, పశుధాన్యములనులోనగు వానిరక్షించుటయనెడు స్థానశుశ్రూషయు, గురువునకునభ్యంగన స్నానాదులఁ జేయించుటయనెడు నంగశుశ్రూషయు, గురుఁడే తల్లిదండ్రులు చుట్టము దైవము రక్షకుండని తలంచుటయనెడు భావశుశ్రూషయు, గురువుతనమనంబునఁ దలఁచిన పదార్థముల నడుగకమునుపే తృప్తిగఁ దెచ్చియిచ్చుటయనెడి నాత్మశుశ్రూషయు, ననునీచతుర్విధశుశ్రూషలఁ దృప్తునింజేయుట శిష్యునకుఁ బరమధర్మంబు. మఱియు. “శ్లో॥ గురుపాదోదకంపీత్వా।గురోరుచ్ఛిష్టభోజనం।గురుమూర్తేసదాధ్యానం । గురుమంత్రంసదాజపేత్” అను శ్లోకము ననుసరించి గురువుయొక్కపాదతీర్థమునుబానముచేయవలయు, గురువుయొక్క యెంగిలిం గుడువవలయు, సద్గురువునే యెల్లప్పుడు ధ్యానించవలయు, సర్వదాగురుమంత్రము నేమరక జపింపవలయు. ఇది యన్నింటికన్న నుత్కృష్టంబగు ధర్మంబు. ఇట్టిధర్మంబు నాచరింపకున్న, సద్గురునిచే నెన్నియుపదేశంబులఁ

బడసియు నవినిరర్థకంబులు. అర్థము,అనగా=ధన
ము. ఇది రెండువిధములు. అందు శరీరకష్టంబున
గడించిన ద్రవ్యంబు లౌకికంబగు. సద్గురుమూర్తిచే
లనంబడసి జ్ఞానరత్నంబను ధనంబు పారమార్థికం
బగు. ఈరెంటిని నపహరించుటకుఁ జోరులుగలరు.
అందుఁదానుగడించిన లౌకికధనంబు గురువునకొ
సంగకను, సత్పాత్రులకు దానముచేయకుండినను,
శత్రురాజచోరులచే నపహృతంబగును. గురుప్రసా
దంబునంగలిగిన జ్ఞానధనంబు. "శ్లో॥ కామక్రోధశ్చ
లోభశ్చ । దేహేతిష్ఠంతితస్కరా । జ్ఞానరత్నాప
హారార్థం।తస్మాజ్జాగ్రతజాగ్రతః॥" అనుశ్లోకంబునను
సరించి, కామ,క్రోధ,లోభ, మోహ,మద, మాత్స
ర్యంబులనునార్గురంతశ్శత్రువులచేనపహృతఁబగును
కావునగురుదత్తంబగు జ్ఞానమే మానవునకు గొప్ప
ధనంబు.అట్టిధనంబునుగొప్పఁగాఁగాపాడుకొనుచు
లౌకికధనంబుచేగురునింబరితృప్తునింజేయవలయును

కామమనఁగా=కోరిక.అదిలౌకికంబనియు,మో
క్షార్థంబనియురెండువిధంబులు: అందుసమస్తము
లగు నిహలోకసుఖంబుల ననుభవింపంగోరుటలౌకి
కంబు. సర్వాంతర్యామియగుపరబ్రహ్మంబునుదర్శిం
పంగోరుట పారమార్థికంబు. మఱియు లౌకికకా
ముకులందఱు నవరూపయౌవన సుందరకాంతలం
గోరి రతిసుఖంబుల ననుభవింతురు. పారమార్థిక

కామకులందఱు, నాధారాది షట్చక్రభూషితయు, సుజ్ఞానచంద్రముఖియు,రాంబీజసింహాసనాసీనయుఁ, ద్రివేణీసంగమ స్థానభూతయు నగుముక్తి కాంతం గోరి యుపరతియను బ్రహ్మానందసుఖంబుల నుభవింతురు మానవుఁడు లౌకికకామంబు తుచ్ఛంబని యెంచి, మోక్షార్థంబునే యరయువలయు.

రాజపుత్రా, నీదృఢచిత్తవైరాగ్యంబును, నీబుద్ధికుశలతయును నరయుటకై నేనిన్నాదరింపనైతి. నీవురాజసామాన్యుఁడవుగావుతొలిజన్మంబులనేక పెద్దలయాశీర్వాదంబులం బడసి యభ్యాసయోగంబులం జక్కఁగానెఱింగినవాఁడవు,కాన ముున్ముందు యమ, నియమాద్యష్టాంగలక్షణంబుల బోధించెదవినుమని చెప్ప నుపక్రమించెనని నవినిధర్మనందనుండు దేవస్థానమునీంద్రునకు నమస్కరించి, 'పుణ్యాత్మా, యావలనాముద్గల మునీంద్రుండుశత్రుంజయమహారాజునకుం బోధించిన తత్వవిచారంబుం దెలుపు' మనిన నతండిట్లనియె.

గద్య॥ ఇది శ్రీమద్రమారమణచరణ సేవాముదితచారిత్రుండును, సుధాకరవంశపయఃపారావార రాకాసుధాకరుండును, ఆత్రేయగోత్రపవిత్ర ఆదివెలమకుల ప్రసూనుండును, అచల గురుండునునగు, పోకల శేషాచలమునాయనివారి పుత్రుండును బుధసేవ్యుండునునగు,పోకల వేంకటనరసింహారావునాయనిచే రచియింపంబడిన బ్రహ్మజ్ఞాన చంద్రోదయంబను శత్రుంజయ మహారాజు చరిత్రయందలి ప్రథమాధ్యాయము.

## ద్వితీయాధ్యాయప్రారంభము.

శ్రీమన్నిగమాంతవేద్యుండగు దేవస్థానముసీం ద్రుండు ధర్మపుత్రునింజూచి, కుంతీనందనా, అట్లు ముద్గలుండు ధర్మార్థకామంబుల యంతరార్థంబులం దెలిపి, భక్తిలక్షణంబుఁ జెప్పంబూని యాశత్రుం జయున కిట్లనియె.

### భక్తిలక్షణము.

రాజాత్మజా, నీకు సకలయోగ విషయంబులం దెలుపుటకు మునుపు, భక్తియు ననన్యచింతయు గలుగవలయు. ఈభక్తిమార్గము శ్రవణము, సంకీర్తనము, స్మరణము, పాదసేవ, అర్చనము, వందనము, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదనమని తొమ్మిదివిధంబులు. అందు సద్గురునివలన సకలాగమ ధర్మంబులువినుట శ్రవణమనంబడు; సద్గురుస్వామికంటెను నన్యమొకటియు లేదనియు,నతఁడే కేవలాత్ముండనియుఁ దలంచి యాతనిం బొగడుచుండుట సంకీర్తనంబనంబడు;సద్గురుస్వామిచే నుపదేశింపం బడినగురుమంత్రమును సదా మరువక జపించుచుండుట స్మరణమనంబడు; సద్గురుమూర్తియొక్క పాద పద్మంబుల సదాకొలుచుచుండుట పాదసేవయనంబడు. శ్రీగురుస్వామి యధివసించుచోటు, నలికిముగ్గుపెట్టుటయు. సుగంధంబులమేనంబూయుటయు,

నపుతలఁ బూజించుటయు, కుసుమములసమర్పించుటయు,ధూపదీపోపహార తాంబూలంబులఁదృప్తినిఁగాఁ జేయుటయునను నీ యెనిమిది విధంబులగుపూజలచే సద్గురుమూర్తికి సంతోషమును బుట్టించుట యర్చనయనంబడు; ప్రతిదినంబును త్రికాలంబుల సాష్టాంగదండప్రణామంబులఁ ద్రికరణశుద్ధిగాఁ బదంబులకు జ్ఞానేంద్రియంబులు సోకునట్లు సాగిలపడి మ్రొక్కుటవందనంబనంబడు; శ్రీగురుమూర్తియాజ్ఞననుసరించి కింకరునివగిది వర్తించుట దాస్యమనంబడు; నిజగురుమూర్తియెడల ప్రియభావముండై స్నేహభావంబున మెలంగుట సఖ్యమనంబడు; పరమాత్మస్వరూపుండగు సద్గురుమూర్తికి, నిడాపింగళనాడుల సంచరించు నాత్మస్వరూపునింగలిసి, సోహంభావనాసక్తచిత్తుండై, సుషుమ్నానాళవ్యాపకుండై, ప్రాణవాయువుల నర్పించుట యాత్మనివేదనంబనంబడు. మఱియు నీభక్తిమార్గంబు, బాహ్యము, అనన్యము, ఏకాంతము, అనిమూఁడువిధంబులు. అందు సద్గురుమూర్తియొక్క సాకారస్వరూపంబునకు నర్చనవందనాది పూజలొనరించుట పరోక్షజ్ఞానంబగు బాహ్యభక్తియనంబడు; సద్గురుస్వరూపంబగు పరబ్రహ్మంబునకన్న వేరొండు లేదని ప్రాణవాయువుల సద్గురువునకు నర్పించుట యపరోక్ష జ్ఞానంబగు ననన్యభక్తి యనంబడు;

స్వరూప చిద్రూపంబులొక్కటియేయని నిశ్చయ జ్ఞానంబుగలిగి శాశ్వతసుఖానందుండగుట యేకాంతభక్తియనంబడు. అని చెప్పిన విని శత్రుంజయుండు సద్గురువునకు నమస్కరించి, మహాత్మా, మీచేబోధితంబగు నీభక్తిమార్గంబుసమగ్రంబుగ నెఱింగితి. అష్టాంగలక్షణంబుల తెఱంగెఱింగింపుఁడని వేఁడిన, నామునీంద్రుండిట్లనియె.

## అష్టాంగములలక్షణము.

రాజాత్మజా! యోగాభ్యాసంబునకుఁ బూర్వమును, యోగాభ్యాసానంతరమును నభ్యసింపందగిన విధులు ఎనిమిదిగలవు, వానినేయష్టాంగంబులనంబడు. అందు యమ, నియమాసన ప్రాణాయామంబులు పూర్వాంగంబులు. ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులుత్తరాంగంబులు. ఇంకనొక్కొక్కదాని వివరించెద శ్రద్ధాసక్తుండవై వినుము.

## యమలక్షణము.

యమమనఁగా=శరీరసాధనము. ఇది సత్యము, దమ, క్షమ, ధృతి, మితాహారము, ఆర్జవము, బ్రహ్మచర్యము, అస్తేయము, అహింస, శౌచమని పది విధంబులు. అందుఁ జూచినది జూచినట్లును, విన్నది విన్నట్లును, నున్నది యున్నట్లును దప్పక చెప్పుటయు, మాన, ప్రాణ, విత్తభంగంబుల సమయంబులఁగల్గినప్పటియు నొకరిమేలుకొఱకు బొంకుట

యము, సత్యమనంబడు. ధర్మార్థనాశనంబులును, హిత
బాంధవజనక్షయంబులును, దారిద్ర్యపద భ్రంశా
వమానంబులును, ధిక్కారవ్యాధి శోకంబులునుజూ
చుటచేతనైనను, వినుట చేతనైనను, ననుభవిం
చుటచేతనైనను గలుగు కరుణారసంబు దయ
యనంబడు. క్షమయనఁగా శాంతము. ఇదియాత్మా
నాత్మవివేకము; ఇహాముత్రార్థఫలభోగవిరాగము,
శమాది షట్కసంపత్తి, ముముక్షుత్వము, అని
నాల్గువిధంబులు. అందు ఆత్మలక్షణమిట్టిది, అనా
త్మయగు దేహలక్షణమిట్టిది, పరబ్రహ్మ లక్షణమి
ట్టిది, ప్రపంచలక్షణమిట్టిదని విచారించుటయాత్మా
నాత్మవివేకంబనంబడు. ఇహలోక సుఖంబులును,
స్వర్గలోకసుఖంబులును, తుచ్ఛంబులు, ననిత్యంబు
లని యెంచి, వానియందలి యాశవిడుట, ఇహాము
త్రార్థఫల భోగవిరాగంబనంబడు; అంతరింద్రియ
బాహ్యేంద్రియ నిగ్రహంబు గలిగి, కామక్రో
ధాదులనెడు నరిషడ్వర్గంబులకు దగులువడక, శమద
మాదులుగలిగి వర్తించుటయే శమాదిషట్క
సంపత్తియనంబడు; ఆత్మయే బ్రహ్మమనియు, ఆత్మక
న్యమైన వస్తువు వేఱొకటిలేదనియు, నామరూ
పములతోఁగూడిన ప్రపంచంబు దబ్బరయనియు,
కాలత్రయావస్థాత్రయంబుల నశించనిపరబ్రహ్మమే
సత్యమనియు నెంచి, నిరతిశయానందమును బొం

దుట ముముక్షుత్వమనంబడు. గురుభక్తియను పెను గొడ్డలిచే నింద్రియ సంసారమును ఛేదించుట యందుగలిగిన ధైర్యంబు ధృతియనంబడు. ఎక్కు-సముగాక కొంచెము తక్కువగా భుజించుటే మితాహారంబని చెప్పంబడు. కపటముగాని చక్క-నైన రాజయోగంబనుష్ఠించుట, ఆర్జవమనంబడు, పరకాంతాసోదరుఁడై నిజకాంతమపుత్రేచ్ఛంజేసి, ఋతుకాలంబులఁగలిసి తనివినొందుట బ్రహ్మచర్య యనంబడు. తనకెంతటి కష్టకాలము ప్రాప్తించి నను, పరులసొమ్ము నపహరించుటకు మనంబునఁ దలఁపక, యుపహరింపుమనినోటంజెప్పక, తానును జేతముట్టకయుండుట అస్తేయంబనంబడు. పిపీలిక ము మొదలు బ్రహ్మపర్యంతముగాగల, సమస్త ప్రాణికోటి యెడదయగలిగి, మనోవాక్కాయం బుల హింసచేయకుండుటయు, విధ్యుక్తంబులగు యాగములయందు దేవప్రీతిగాఁ బశువులదోలిం చుటయు అహింసయనంబడు. జలములచేతను, సుగంధాది లేపనములచేతను, శరీరంబుశుద్ధిఁజే చుట బాహ్యశౌచంబనియు, కామక్రోధాది దుర్గు ణంబులనడంచి, యాణవ, కార్మిక, మాయిక, మా యేయ, తిరోధానంబులను పంచవిధ మలంబుల తోడ మానసంబు నిర్మలంబుగావించుట యంతః శ్శౌచంబనంబడు.

## నియమలక్షణము.

నియమమనఁగా—శరీర ప్రత్యగ్వస్తువుల యొక నిత్యాచరణక్రియ. ఈనియమము, తపము, సంతోషము, ఆస్తికత్వము, దానము, భగవదర్చన, వేదాంతశ్రవణము, లజ్జ, మతి, జపము, వ్రతము, అని పదివిధంబులు. తపమనఁగా—పుణ్యకర్మాచరణము. ఇది కాయసంబంధము, వాక్సంబంధము, మనస్సంబంధములని మూఁడువిధంబులు. అందుఁ బెద్దలఁబూజించుట, బాహ్యపరిశుద్ధి, యడకువ, బ్రహ్మచర్యము, అహింసయును గలిగియుండుట కాయసంబంధంబైన తపంబనంబడు; ఇతరులనొప్పించక సరసంబుగ సత్యవచనంబులాడుటయు, వేదంబుల పఠించుటయునను నవి వాక్సంబంధంబైనతపంబనంబడు; మనోనిగ్రహము, వైరాగ్యము, మనశ్శుద్ధిగలిగియుండుటయునునవి మనస్సంబంధంబైనతపంబనంబడును. శుభాశుభ కార్యంబుల తద్దైవానుకూల్యకాలంబుల నిర్వర్తింపుచు, దురాశనుం బొందక, తనకు లభించినమట్టుకుఁ దృప్తినొందియుండుట సంతోషమనంబడు. భగవంతుండొకఁడున్నాఁడని నమ్మి, వానియెడ భయభక్తిశ్రద్ధలుగలిగియుండుట యాస్తికత్వంబనంబడు. దానమనఁగా—ఈవి; ఇదితనకుఁ గల్గుద్రవ్యంబునుగొంతయొసంగుట తానుబొందినధనమున కానుకూల్యంబుగనడచుట, అపూర్వవస్తువు

లనొసంగుట, ధనమిచ్చి వానిం బూజించుట, యొకని యప్పుతీర్చుటయని యైదువిధంబులు. భగవంతుని యెనిమిది విధంబులచే నర్చించుట భగవదర్చన యనంబడు. సద్గురుమూర్తి వలన సకల తత్త్వార్థంబులవినుట వేదాంతశ్రవణమనంబడు. అద్వైతావలంబనముచేయక, మతాంతరంబులందగిలి బ్రహ్మజ్ఞానతత్పరులగు నార్యులచే, దూరీకృతుండగుటం జేసి యవమానంబునొందుట లజ్జయనంబడు. శాస్త్రచింతనాదులచేఁ గలుగు సత్యనిర్ణయజ్ఞానము మతి యనంబడు. వేదార్థంబును, బ్రణవస్వరూపంబును నగు గాయత్రీమంత్రాక్షర ద్వయంబును స్మరించుటే జపమనంబడు. సద్గురునాజ్ఞననుసరించి, తాను జ్ఞాన స్వరూపుండగు నంతవరకు, యోగమార్గంబులఁ జక్కఁగా ననుభవించుటే వ్రతంబనంబడు.

ఆసనములలక్షణములు.

ఆసనమనఁగా=సమాధులకనుకూలతఁ గూర్చుండువిధము. ఇది స్వస్తికాద్యనేక విధంబులఁ జెప్పంబడుచుండు. అందు జంఘలకును. తొడలకును నడుమఁ బాదంబులం జొనిపి, దేహమును జక్కఁగా నిక్కించి కూర్చుండుట స్వస్తికాసనంబనంబడు. వామపాదగుల్ఫంబును కుడిపిఱ్ఱప్రక్కగాను, కుడికాలిమడిమను, వామపృష్ఠపార్శ్వంబునను గదియించి, రెండవ కాలిపై మతియొకటిం జేర్చి చక్కనిక్కఁగా

ర్చుండిన, గోముఖాసనంబనంబడు. వామాంకంబున కుడిపాదంబును, దక్షిణాంకంబుపై నెడమ పాదంబునునునిచి, దక్షిణపాదాంగుష్ఠంబును దక్షిణకరంబునను, వామపాదాంగుష్ఠంబును వామకరంబునను బట్టి, చుబుకంబును హృదయంబునం జేర్చి కూర్చుండుట పద్మాసనంబనంబడు. రెండుతొడలపై రెండు పాదములను జేర్చి, శరీరమునువక్రంబుగానిలిపి కూర్చుండిన, వీరాసనంబనంబడు. ఇంక ననేకవిధంబులగు నాసనంబులునుగలవు. అవియన్నియును రాజయోగంబునకు నిరర్థకంబులు.

ప్రాణాయామలక్షణము.

ప్రాణాయామంబనఁగా=నాసికారంధ్రంబుల సంచరించెడు వాయువును మంత్రపూర్వకంబుగా నిరోధించుట. ఇది ప్రాకృతము, వైకృతము, కుంభకంబని మూడువిధంబులు. అందు రేచకపూరక స్వరూపంబగు నజపాగాయత్రీమంత్రంబును బ్రతిదినంబును నిరువదియొక్క వేలయాఱునూరు జపించుచు నాధారాది షట్చక్రస్థానాధిపతులకు నియమంబు చొప్పున సమర్పించుటే ప్రాకృత ప్రాణాయామంబనంబడు. రేచకపూరక కుంభకంబులచేత, హంసయొక్క యూర్ధ్వాధస్సంచారంబుల నేకంబుచేసి, ప్రాణాపానంబుల నొకటిగాఁజేర్చుట వైకృతప్రాణాయామంబనంబడు. వామగుల్ఫంబున గుదస్థాన

మును బంధించుటయనెడు మూలబంధముచేతను, దక్షిణగుల్ఫంబున నాభినిగప్పుటయనెడు నుడ్యాణబంధముచేతను,హృదయంబునచుబుకంబును గదియించుటయనెడు జాలంధరబంధముచేతను, హంససంచారస్త్రోవల నడ్డగించి కేవలకుంభకంబున నిలుచుట కుంభక ప్రాణాయామంబనంబడు. వీనినే యోగపూర్వాంగంబులనంబడు. అనిన నారాజపుత్రుండు సంతసించి, మహాత్మా, యోగపూర్వాంగంబులం దెలిసితి. ఇంక నుత్తరాంగంబుల నెలవిండనిన, నామునీంద్రుండిట్లనియె.

ప్రత్యాహారలక్షణము.

ప్రత్యాహారమనఁగా—విషయంబులవలననింద్రియంబులమరలించుట;అనఁగా సుశబ్దాపశబ్దములవినుటయు, శీతోష్ణముల స్పర్శముచేఁదెలిసికొనుటయు, వర్ణపరిమాణంబగు వివిధరూపంబులఁజూచుటయు, షడ్రసంబులరసనేంద్రియము ద్వారానెఱుఁగుటయు, సుగంధదుర్గంధాదుల ఘ్రాణేంద్రియముద్వారామూర్కొనుటయు,మంచిచెడ్డలనోటితోఁ బల్కుటయు, దానధర్మంబులఁ జేతులతోఁజేయుటయుఁ బుచ్చుకొనుటయు, పాదములతోగమనాదులుచేయుటయు, గుహ్యేంద్రియంబుతోసురతానందంబులఁజెందుటయు, మల విసర్జనాదులు పాయురింద్రియముతోఁజేయుటయు, మనంబునసం

శయించుటయు, బుద్ధిచేనిశ్చయించుటయు, జిత్తంబున సంకల్పంబునొందుటయు, అహంకారముచే దానననభిమానమును బొందుటయునను, నీచతుర్దశేంద్రియంబుల వానివాని వ్యాపారంబులతోడ మరలించుట ప్రత్యాహారంబనంబడు.

## ధ్యానలక్షణము.

ధ్యానమనఁగా=చాంచల్యములేక భగవంతుని మనంబునందలంచుట. ఇది సగుణము, నిర్గుణమని రెండువిధంబులు. అందుఁద్రిగుణంబులకు నామరూపములనుగల్పించి ధ్యానించుట సగుణధ్యానంబనంబడు; పరమహంసుని నూర్ధ్వముఖంబుగానడిపి ప్రణవాక్షరద్వయమును జిత్తమున్గంజేర్చి తదేకనిష్ఠాపరుండై స్మరించుట నిర్గుణధ్యానంబనంబడు.

## ధారణలక్షణము.

ధారణయనఁగా=భగవంతునిదప్ప మఱియొకటియునెఱుంగక యెల్లప్పుడు వానియందేమనస్సునిలుపుట. అనఁగా, షట్చక్రంబులయందుహంసతిరుగునప్పు డాయాచక్రాధిపతులగు గణపత్యాద్యధిదేతలకు తన్నియమ సంఖ్యనుమనంబున నిలుపుట,

## సమాధిలక్షణము.

సమాధియనఁగా=మనోలయము. ఇది సవికల్పమనియు, నిర్వికల్పమనియు రెండువిధంబులు. వివిక్తప్రదేశంబుల కృష్ణాజినంబుపై కూర్చుండి, నియ

మంబుబూని ప్రణవేతరంబులగు పంచాక్షరి, య ష్టాక్షరి మొదలగు మంత్రములనుజపించుట సవికల్ప సమాధియనంబడు; దేశకాల నియమంబులు లేక, సర్వకాల సర్వావస్థలయందును జిత్తమును బ్రణవ స్వరూపుండగు హంసునితోలియ్యపఱచుట నిర్వికల్పసమాధియనంబడు. ఈపైఁజెప్పంబడిన నాల్గింటిని యుత్తరాంగంబులని చెప్పంబడును. అనినవిని శత్రుంజయుండు ప్రముదితాత్ముండై సద్గురునింగని, మహాత్మా, అష్టాంగలక్షణంబులఁ జక్కగానెఱింగితి, నింక చతుర్విధయోగంబుల వివరింపుఁడనిన నామునివరుండిట్లనియె.

రాజపుత్రా! మంత్రయోగమనియును, లయ యోగమనియును, హఠయోగమనియును, రాజ యోగంబనియునుయోగంబులునాలుగువిధఁబులు. అందు షణ్మతంబులయందును, నిష్ఠదేవతా ప్రార్థనాదులయందును, యాగాదులయందును, షోడశ కర్మములయందునువేదోక్తనియమంబులయందును గల సప్తకోటి మహామంత్రములను, పూజా, జప, నియమాదులచేత, జపించుట, పూజించుట, లోన గునవి మంత్రయోగంబనంబడు. మనస్సు బిందువునందును, బ్రాణంబును కళయందును, మనఃప్రాణంబులనాదమందును లియ్యపఱచి, చిత్కళాదుల దర్శించుచుఁ గొందఱును, మఱికొందఱు షట్చక్రం

బుల హంసునినిలుపుచు, మనంబు లయింపం జేయు చుందురు. మఱికొందఱు. జిహ్వాంతరజిహ్వాలనేకము చేసి, మారుతమును బిగియంబట్టి, హంసునినాజ్ఞా చక్రమందేనిలుపుచుందురు. మఱికొందఱునిజశరీరం బున హంసనులయింపంజేసి పరకాయంబులఁ బ్రవే శించుటచేతను, ననేకవిధంబుల నీలయయోగంబు సాధింతురు. హఠయోగమనఁగా=ఇంద్రియములకు స్వభావజన్యంబులగు వృత్తులఁ బలాత్కారముగా మరల్చుట. కొందఱు పాయురింద్రియంబున జలం బులాకర్షించి దేహాంతర్గతంబులగు మలంబులబైట విడిచి. కంఠగతంబులగు, కఫపిత్తాదులఁ గ్రక్కుచు, మత్రసంబులవర్జించి, ప్రాణంబునిరోధించి, హంసను కేవలకుంభకంబుననిలిపి, కాయసిద్ధినిఁబొంది, య ణిమాదియష్ట సిద్ధులనంది, దూరదృష్టి శ్రవణాదు లును, గగనసంచారంబునుగలిగివర్తింతురు, దీనినే హఠయోగంబనంబడు. ఈమంత్ర-లయ-హఠయో గులు బ్రహ్మసాక్షాత్కారము లేనివారుగానమో క్షార్హులుగారు. అనిన విని యాశత్రుంజయుండు గురుమూర్తింగాంచి, మహాత్మా, మీరిప్పుడానతి చ్చిన త్రివిధంబులగు యోగంబులు కష్టసాధ్యం బులు. రాజయోగపద్ధతిం దెలిపినన్నుఁగృతార్థునిఁ గాఁ జేయుఁడనిన, నామునీంద్రుండిట్లనియె.

## రాజయోగపద్ధతి.

రాజనందనా, రాజయోగమనఁగా శరీరకష్టము లేక సర్వవృత్తులఁ జేయుచుఁ జిత్తమునుమాత్రము విలక్షణుండగునాత్మునియందు లియ్యపఱచుట. ఇది గృహస్థాశ్రమ తత్పరులకు మిక్కిలియానుకూల్యంబు. ఇది సాంఖ్య తారక అమనస్కంబులని మూడు విధంబులు. అందు సాంఖ్యంబు తత్వవిచారంబును, తారకంబు సంసారదారకంబును, ప్రణవస్వరూపంబును, జిత్తవిశ్రాంతియుననగు నిర్వికల్పసమాధి. అమనస్కంబు యోగామనస్కమనియు, జ్ఞానామనస్కంబనియు రెండువిధంబులు, వానిం బిమ్మట వివరించెద. ముందు సాంఖ్యవిచారంబరయుమని యిట్లనియె.

## సాంఖ్యయోగలక్షణము.

రాజాత్మజా ! ఆదియందు సకలగుణశూన్యమై పంచావస్థలులేనిదై, కాలత్రయంబులఁ బొరయనిదియై, ఉపాధిద్వయ దోషరహితమై,నిరంజనమై నామరూపంబులులేని సర్వవ్యాపకంబగునచల బ్రహ్మంబుగలదు. దానియందు స్వయంభువును, సర్వసాక్షి స్వరూపుండును, మహాకారణశరీరుండగుహిరణ్యగర్భుండను, నవ్యాకృతుండొక్కండువొడమె. అతఁడే సర్వసాక్షి స్వరూపుండగు పరబ్రహ్మంబు. ఆపరబ్రహ్మంబునందు గప్పురంబుననుండు తావి

యుంబోలె. కారణశరీరుండగు ప్రాజ్ఞుండనుమూల ప్రకృతియొకటి ప్రకాశించుచుండును. ఇతఁడే అవిద్యోపాధిగల జీవుండనంబడును. ముందుచెప్పిన హిరణ్యాగర్భుఁడే ఈశ్వరుండనంబడును. ఇవేజవేశ్వరులయుత్పత్తివివరము. ఇంకశరీర పంచీకరణ లక్షణంబుల నెఱింగించెద.

స్థూలపంచీకరణలక్షణము.

రాజపుత్రా, స్థూలసూక్ష్మకారణంబులకు వేరువేరుగా పంచీకరణంబులుగలవు, అందు, ఆకాశవాయురగ్ని జలపృథ్వులైదును, సమష్టివ్యష్టిభేదంబుల నొక్కొక్కటియు రెండుగావిభజింపంబడి యిరువదియైదుతత్వంబులయ్యె. ఇవియే తామసగుణాత్మకంబైన స్థూలశరీరంబు. ఈస్థూలపురుషునే విశ్వుఁడని చెప్పంబడును. ఈవిశ్వునకు, ఆకాశతత్వంబులును, నంతరింద్రియంబులుననగు జ్ఞానమనోబుద్ధి చిత్తాహంకారంబులును, వాయుతత్వంబులును పంచప్రాణంబులుననగు సమానవ్యానోదాన ప్రాణాపానంబులును, అగ్నితత్వంబులును జ్ఞానేంద్రియంబులుననగు శ్రోత్రత్వక్చక్షుజిహ్వాఘ్రాణంబులును, జలతత్వంబులును నగ్నితత్వంబులకు విషయంబులుననగు శబ్దస్పర్శరూపరసగంధంబులును, పృథ్వీతత్వంబులును గర్మేంద్రియంబులుననగువాక్పాణిపాద గుహ్యాపాయువులు

నుగూడి స్వరూపనిర్ణయంబయ్యె. ఇక వీనిస్వభావ జన్యకృత్యంబుల వివరించెద. జ్ఞాతసమానవాయువునుంగూడి, శ్రోత్రేంద్రియము ద్వారాశబ్దమును గ్రహించి, వాగింద్రియము ద్వారామాటలాడుచున్నది. ఈజ్ఞాతయే మనోరూపకమై వ్యానవాయువునుం జేరి, త్వగింద్రియము ద్వారా స్పర్శనుగుర్తెఱిఁగి, పాణీంద్రియము ద్వారా దానధర్మపరిగ్రహంబులఁ జేయుచున్నయది. ఈజ్ఞాతే బుద్ధిరూపకమై, యుదానవాయువునుంగలిసి, చక్షురింద్రియము ద్వారా నానారూపంబులఁజూచుచుఁ బాదముల తోగమనాగమనములుచేయుచున్నయది. ఈజ్ఞాతయే, చిత్తరూపకమై ప్రాణవాయువునుం గూడి జిహ్వేంద్రియముద్వారా షడ్రసంబులఁ చవిచూచి యెఱింగి, గుహ్యేంద్రియముద్వారా విషయాదుల సుఖించుచున్నయది. ఈజ్ఞాతయే, అహంకర్తృత్వమునుబొంది, యపానవాయువునుం గూడుకొని ఘ్రాణేంద్రియముద్వారా సుగంధ దుర్గంధంబుల మూర్కొని, పాయురింద్రియము ద్వారా మలవిసర్గనముచేయుచున్నది. ఇవి ప్రకృతికి స్వభావజన్యవృత్తులు. వీనితో మనంబునుగూడి యీప్రపంచవృత్తులంజరుపుచుండును.

సూక్ష్మపంచీకరణలక్షణము.

శ్లో॥ పంచప్రాణమనోబుద్ధి । దశేంద్రియ

సమన్వితం। అపంచీకృతభూతోద్ధం । సూక్ష్మాంగం భోగసాధనం॥" అని చెప్పుటచేత పంచప్రాణంబులగు, సమాన,వ్యాన,ఉదాన, ప్రాణాపానంబులును, మనస్సును, బుద్ధియును, జ్ఞానేంద్రియంబులగు, శ్రోత్రత్వక్చక్షు జిహ్వాఘ్రాణంబులును, తద్విషయంబులగు శబ్దస్పర్శరూపరస గంధంబులును జేరి, సూక్ష్మపంచీకరణంబయ్యె. ఇందుకర్మేంద్రియంబులును. చిత్తాహంకారంబులును లేకపోవుటచేత దీనినే సమాధిలక్షణమనంబడును.

## కారణపంచీకరణలక్షణము.

నేత్రంబునంగలుగు, నీల,ధూమ్ర,కృష్ణ, శ్వేత, పీతవర్ణంబులే, యాకాశాది పంచమహాభూతంబులు. ఇవియే స్థూలసూక్ష్మభూతంబులకు కారణభూతంబులు. మఱియు, చిత్తంబు జ్ఞానసంసర్గంబునుంబొంది, సర్వేంద్రియ సాంగత్యంబునువిడిచి, చిన్మయునియందే కూడియుండుట కారణస్వరూపునిలక్షణము. అని చెప్పిన శత్రుంజయుండు 'సద్గురువర్యా' నేనీసాంఖ్యసూత్రంబును, చిన్ననాటనే నాదుతండ్రికింగురుండగు భరద్వాజ మహామునీంద్రుని చేవినియున్నాఁడను. దేవరవారిక నాకుందారకోపదేశంబు సేయుఁడనిన నామునీంద్రుండిట్లనియె.

## తారకయోగలక్షణము.

రాజపుత్రా, తారకమనఁగా=సంసారాంబుధి

నిదాటించునది. ఈ తారకమునే ప్రణవమనంబడు. ఈశరీరంబున సర్వేంద్రియ సాంగత్యంబువిడనాడి త్రిగుణంబులులేని సుషుప్త్యావస్థయందు సైతము నేది సూర్యచంద్రులను నిడాపింగళనాడులయందా రోహణావరోహణంబులుగలిగి వర్తించుచున్నదో యట్టిహంసుని గురుముఖంబుననెఱింగి,చిత్తస్వరూపుండగు జీవుండు తదేకనిష్ఠాపరుండై ధ్యానించుటయే తారకయోగమనంబడు. శ్లో॥ "దేహో దేవాలయఃప్రోక్తో। జీవోదేవస్సనాతనః। త్యజేదజ్ఞానంనిర్మాల్యం।సోహంభావేనపూజయేత్" అనుటచే నీశరీరంబను దేవాలయంబుననుండు జీవుండే బ్రహ్మమగుననితలంచి, యజ్ఞానంబను నింద్రియ సాంగత్యమునువదలి, నిర్మలుండై సోహంభావమునే జపింపవలయును. దీనినేయజపాగాయత్రియనియు, బ్రహ్మసూత్రంబనియుఁజెప్పంబడును. దీనిని జ్ఞానేంద్రియంబగు జిహ్వయనుచిత్తమును హత్తించి, దినమునకు నిరువదియొక్క వేయునార్నూరు జపింపవలయును. తద్వివరంబెట్టిదనిన, శ్లో॥ "ఆధారే లింగనాభౌహృదయ సరసిజే తాలుమూలేలలాటే। ద్వేపత్రేషోడశారేద్విదశదశదళేద్వాదశార్ధేచతుష్కే। వాసాంతేబాలమధ్యేడఫ కఠసహితే కంఠమూలేస్వరాణాం। హంక్షంతత్వార్థయుక్తం సకలదళయుతం వర్ణరూపంనమామి॥ శ్లో॥"షట్ఛతానిగ

జేశాయ। షట్సహస్రంస్వయంభువే। విష్ణవేషట్సహ స్రంతు। షట్సహస్రంపినాకినే । సహస్రమాత్మనేచై వ। సహస్రంపరమాత్మనే। సహస్రమేకంగురవే। అర్ప యామికృతంజపం॥" అని చెప్పంబడియున్నదిగనుక, వ, శ, ష, స, యనునాల్గువర్ణంబులుగలదళంబులుగలి గిన, ఓంకారబీజస్థానంబగు, నాధారకమలంబునకధి పతియైనవినాయకునకునార్నూరుజపంబులను; లింగ స్థానంబున, బ, భ, మ, య, ర, ల, యనునారక్షు రంబులుగల దళంబులుగలిగిన, నకారబీజస్థానంబ గు స్వాధిష్ఠాన కమలమున కధిపతియైన బ్రహ్మదే వునకు నారువేలుజపంబులను; నాభిస్థానంబున, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ప, ఫ, యనుపదియ క్షరంబులుగల దళంబులుగలిగిన, మకారబీజస్థా నంబగు మణిపూరకకమలంబున కధిపతియగువిష్ణు దేవున కారువేలుజపంబులను; హృదయస్థానంబున, క, ఖ, గ, ఘ, ఙ, చ, ఛ, జ, ఝ, ఞ, ట, ఠ, యను ద్వాదశాక్షరంబులుగల దళంబులుగలిగిన శివర్ణబీజస్థానంబగు ననాహతకమలంబున కధిపతి యగు శివదేవునకు నారువేలుజపంబులను; కంఠస్థా నంబున, అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః, యనుపది యారచ్చులుగల దళంబులుగలిగిన, వా-బీజాక్షర స్థానంబగు విశుద్ధకమలంబున కధిపతియగుజీవునకు

వేయిజపంబులను; భ్రూమధ్యంబున, హాం, క్షం, అను రెండువర్ణంబులుగలదళములుగలిగిన, యఃయ నుబీజాక్షరస్థానంబగు నాజ్ఞాకమలంబునకు నధిపతి యగుపరమాత్మునకు వేయిజపంబులను; ఫాలభాగం బున సర్వవర్ణంబులుగల వేయిదళంబులుగలిగిన, రాం-బీజస్థానంబగు సహస్రారకమలంబున కధిపతి యైన సద్గురుమూర్తికి వేయిజపంబులను నర్పింప వలయును. అని యష్టాక్షరీమంత్రంబు నుపదేశించి సోహంభావనాసక్తచిత్తునింజేసిన, నాశత్రుంజయుం డు ముదంబంది, 'మహాత్మా' దేవరవారానతిచ్చిన యష్టాక్షరీమంత్రంబునధం-అనునక్షరంబునకుఁగమ లంబుగానమి నామనంబు సందియంబునొందుచున్న యది. అనిన నామునీంద్రుండిట్లనియె. మానసపు త్రా, ధం-అనుబీజాక్షరంబునాదబ్రహ్మంబునలియ్యా పడియున్నయది. తద్వివరంబమనస్క-యోగంబున వివరించెద. ఇప్పుడు పద్మాసనస్థుండవై రెండుజా ములకాలము తదేకనిష్ఠాపరుండవై పరమహంసుని నీచిత్తంబునంగూర్చి జపించుచుండుము. అని చెప్పిన, నతండటులఁజేయుచుండెను. ఇట్లునిండువైరాగ్యం బుతోఁ జిత్తంబును నాత్మారామునియందే లియ్యా పఱచినిర్వికల్పసమాధియందుండఁగా, దేవమునియ గునారదుండు స్వర్గలోకంబునకుంబోయి దేవేంద్రు నకుంజెప్పిన, నాపాకారితత్తరపడి తనరాజ్యంబు

గొనుసేమోయనిమనంబున దిగులొంది, ఉచ్చైశ్శ్రవారూఢుండై వచ్చి యాశత్రుంజయునకుఁ బ్రత్యక్షంబై, రాజనందనా, నీసమాధినిజాలించినీకువలసినవరంబులు వేడుమనిన, నాతండుచిత్తమునుమరలించి, కన్నులుదెఱచిచూచిగురువునకునమస్కరించిన, నాముద్గలమహాఋషి, రాజపుత్రా, నీయోగంబునకు మెచ్చి ప్రత్యక్షంబైన నీదేవేంద్రునకు నమస్కరింపుమనిన, నాశత్రుంజయుండు దేవేంద్రునకు నమస్కరించి, దేవరాజా, నాదు పూర్వపుణ్యఫలంబునం జేసి మీదర్శనంబయ్యె, నాయోగంబుసిద్ధినొందె నావుడు నాశచీపతి, రాజకుమారా, నీవలెగురూపదేశమైనతోడనే యింత దీర్ఘసమాధి సల్పినవారింజూచి యెఱుంగను, నీమనోదృఢత్వంబునకు సంతసించి, నీకోరికలు సఫలంబులం జేయ నీకుం బ్రత్యక్షమైతిననిన, నతండు, దేవదేవా నేనిష్కాముండనై గురునాజ్ఞననుసరించి ధ్యానతత్పరుండనై యుంటిఁ గాని వేరొండుకోరికలేదనిన నాపాకశాసనుండు సంతసించి, యాతని కపూర్వాస్త్రరాజంబులనొసంగి, "రాజకుమారా, నీధనుర్గురుండగు వీరవర్మచేనీఁబడిన జితారిమత్తనుచంద్రాయుధంబు సర్వశత్రు నాశనకరంబు, దానినొక యక్షుడుశక్తిప్రసాదంబునంబొంది నీగురునకిచ్చె, నతండు నీకునొసంగెను. అట్టియాచంద్రాయుధంబుచేమహీ

ఖుండలనాయకత్వముంబొందు'' మని చెప్పి యంత
ర్థానుండాయెనని చెప్పిన,విని ధర్మనందనుండు దేవస్థా
నమునీంద్రునకునమస్కరించి, 'మునీంద్రా, శత్రుం
జయమహారాజునకు ముద్గలమహాఋషిబోధించిన
జ్ఞానోపదేశంబంతయు నెఱింగింపు'డనిన నతండి
ట్లనియె.

గద్య॥ ఇది శ్రీమద్రమారమణచరణ సేవాముదితచారిత్రుం
డును,సుధాకర వంశపయః పారావార రాకాసుధాకరుండును,
ఆత్రేయగోత్రపవిత్ర ఆదివెలమకులప్రసూనుండును; సకలనిగ
మాగమవేద్యుండును, అచలుండునునగు పోకల-శేషాచలము
నాయనివారిపుత్రుండగు, పోకల-వేంకటనరసింహరావునాయ
ని చేరచియింపంబడిన బ్రహ్మజ్ఞానచంద్రోదయంబను శత్రుంజ
యమహారాజుచరిత్రమునందలి ద్వితీయాధ్యాయము.



## తృతీయాధ్యాయము.

శ్రీమద్వేదాంతస్వరూపుండగు దేవస్థానమునీం ద్రుండుయుధిష్ఠిరునింగని, ధర్మనందనా,అట్లు ముద్గలుండు సాంఖ్యతారకంబులం దెలిపి, యమనస్కయోగం బెఱింగింపం బూని యాశత్రుంజయమహారాజున కిట్లనియె. రాజనందనా, నీదగు నశ్రాంతప్రణవధ్యానంబునం జేసి దేవేంద్రుండు నీకు ప్రత్యక్షం బయ్యె. కావున నీకు నిటపై సకల సాంమ్రాజ్యపట్టాభిషేకంబును నష్టైశ్వర్యప్రాప్తియు మోక్షసిద్ధియుగలుగుననుటకు సందియంబులేదు. ఇకనమనస్కభావం బెఱింగించెద, శ్రద్ధాసక్తుండవై వినుమనియిట్లనియె.

## అమనస్కలక్షణము.

మానసపుత్రా,అమనస్కమనఁగా=మనస్సును మాయావాగురంజిక్కనీయక, కేవల బ్రహ్మానందమునం దేలియ్యపఱచుట. "శ్లో॥ దేహేతుపశ్చిమే భాగే। వీణాదండాఖ్యదేహభృత్। దీర్ఘాస్థిమూర్థపర్యంతం। బ్రహ్మదండీతికథ్యతే॥ తస్యాంతేసుషిరం సూక్ష్మం, బ్రహ్మనాడీతిసూరిభిః। ఇడాపింగళయోర్మధ్యే।సుషుమ్నాసూక్ష్మరూపిణీ॥" అనుశ్లోకంబుల ననుసరించి, కశ్యపాదిమహామునులును, ప్రహ్లాదాదిభక్తశిఖామణులును,నీశరీరంబునందలి పరమహంసస్వరూపుం డగునాత్మారామునికిం బశ్చిమభాగం

బుననుండు బ్రహ్మదండియను వెన్నెముకను నాధా రంబుగాఁగొని, యిడాపింగళులను సూర్యచంద్రనా డులయందు హంసుని రేచకపూరకంబులచేనడిపిం చుచు, నాదబ్రహ్మమును లేపి, యినశశిమార్గంబులఁద ప్పించుచు, నజపకుండలికి సముఖముగా లేవదీసి కుంభించుచు, నాయజపకుండలిని భేదించి, హంసుని సూక్ష్మంబగు సుషుమ్నానాళమున జొప్పించి, బద్ధా సనంబునంగూర్చుండి, నడుమునునిక్కించి, వదనం బించుకవంచి, శిరమును వృక్షకుడ్యాదులకుఁబూ నికచేసి దంతంబులమధ్యను రసనేంద్రియమును నొకకరవ్రేలితోనూటుఁజేసి, పెదవులనుబంధించి, మఱియొకవ్రేలిచే హంసునిసంచారత్రోవనడ్డగించి వేరుమార్గంబుననడిపించుచు, రెండవచేతివ్రేళ్లచే, నీలంపుజ్యోతులఁ జేరంబట్టి, ద్వాదశాంగుళములు రేచించి, యష్టాంగుళములుపూరించుచు,హంసుని స్వాధిష్ఠకుండలిదాటింపం జేయుచు, తటిన్మండల, మేఘమండల, చంద్రమండల, సూర్యమండల, నక్ష త్రమండల, వియన్మండల, చిదాకాశ, ధారాకా శంబులయందలి చిత్రవిచిత్ర కాంతులంజూచుచు, లోవెల్గున వెలివెల్గుమంగలిపి, యచటసత్తామా త్రుండును, నిర్విశేషుండును, కర్తృత్వభోక్తృత్వ ములులేనివాఁడును, సచ్చిదానంద స్వరూపుండును నగు బ్రహ్మస్వరూపంబునందు జీవస్వరూపుండగు

చిత్తునిలియ్యఁ బఱచుటే యమనస్కంబనంబడు. దీని నేకుండలియోగంబంద్రు. ఇదియోగమార్గంబు తెఱంగు. దీనినిసాధించుట బహుకష్టతరంబు. కొందఱీయోగంబునంగన్పట్టుచిత్కళలను దర్శించుటకై యీయమనస్కయోగంబుదుస్తరంబనియెంచిముద్రపంచకంబుచే,దచ్చిత్కళలంగనుచుందురు. అవి ఖేచరి, భూచరి, మధ్యలక్ష్యము, షణ్ముఖి, శాంభవియనియైదువిధంబులు.

పంచముద్రలలక్షణము.

అందునేత్రములముకుళింపఁజేసియైనను,వికసింపఁజేసియైననుజూపును ద్రిప్పిభ్రూమధ్యంబుననిలిపి, చిదాకాశమునుజూచునేని ఖేచరీముద్రయనంబడు. నేత్రములను గదలింపక నాసికాగ్రంబున దృష్టిని నిలిపిచూచునేనిభూచరీముద్రయనంబడు. అర్ధోన్మీలితనేత్రుండై నాసికామధ్యప్రదేశంబునజూపునిలిపి నిటలంబును దిలకించెనేని, మధ్యలక్ష్యమనంబడు. శ్లో॥ "సర్వద్వారాణి సంయమ్య । మనో హృదినిరుధ్యచ । మూర్ధ్న్యాధాయాత్మనఃప్రాణ । మాస్థితో యోగధారణామ్॥" అను శ్లోకప్రకారం బింద్రియద్వారంబుల నారింటిని నరికట్టి బహిర్ముఖంబైన దృష్టిని మనస్సును నంతర్ముఖంబుగాఁజేసి,హంసుని సహస్రారచక్రంబునం జేర్చి, భ్రూమధ్యస్థానంబున దృష్టినిలిపి,యచటదోఁచుచిత్కళావిభూతిని,మండల

త్రయంబునుగనుచు, వీనులనాదంబు లాలకింపు చు, బిందువును జెదరనీకనిలిపెనేని షణ్ముఖియనం బడు. శ్లో॥ “అంతర్లక్ష్యంబహిర్దృష్టి। ర్నిమేషోన్మే షవర్జితా। ఏతేషాశాంభవీముద్రా। సర్వతంత్రే షుగోపితా॥” అనువిధంబైన ప్రాణాదిదశవాయు వులను, మనోబుద్ధి చిత్తాహంకారంబుల నొకటిం గాఁజేసి నేత్రములనుదెఱచి, చూపును జిదాకా శంబున హంసునివర్తించి, యచటిచిత్కళలంజూ చుచుండెనేని శాంభవీముద్రయనంబడు. ఈపంచ ముద్రలు రాజయోగులకవశ్యంబులుగావు. ఇందు లకొక్క యితిహాసంబుగలదు వినుమనియిట్లనియె.

విజయకేతుండను-మహారాజుచరిత్రము.

తొల్లి మగధదేశంబునకు రాజధానియగు ప్రతి ష్ఠానపురంబును బాలించెడు జయకేతుండను రాజు సుధర్మయను భార్యయందు విజయకేతుండను నొకపుత్రునింబడసెను. ఆరాజపుత్రుఁడు శైశవం బుమొదలు వేదాంతశ్రవణంబుసేయ నిశ్చయించి, నిజపురప్రాంత ప్రదేశంబుననుండు నొకమఠంబు నకుంబోయి, యచ్చటి జోగులాడుకొను యోగా భ్యాసమహాత్మ్యంబుల నాలకింపుచుఁ దనకు పది యారేండ్ల ప్రాయమురాగానే నొక్కయోగీశ్వరు నింజేరి, యాతనికి వివిధశుశ్రూషలొనరించి, యా తనియొద్ద పంచముద్రల లక్షణంబుల నెఱింగి,

యభ్యాసంబుచేయుచుండ, జయకేతుండు, తనపుత్రుండు న్యాయశాస్త్రంబులును, ధనుర్విద్యయు నభ్యసించియు లౌకికవర్తనం బెఱుంగనికతంబున, రాజ్యార్హుండుగాక పోయెనేయని విచారంబు నొందిచింతింపుచుండ,నొక్కనాఁడు దేవమునియగు నారదుండేతెంచినంగాంచి, యాతనినత్యర్థిభయభక్తుల నర్ఘ్యపాద్యాదివిధులంబూజించి, యర్హాసనంబునంగూర్చుండనియమించి, యాతనిపదంబులనొత్తుచు విచారమనస్కుండై యున్నంజూచి యామునీంద్రుండిట్లనియె. రాజచంద్రమా, నీవుసకలైశ్వర్యసంపన్నుండవై యుండియు, నిటుల చింతాపరీతచేతస్కుండవై యుండుటకుగతంబెద్ది యెఱిఁగింపుమనిన నతండిట్లనియె. తాపసవర్యా, నేననేకవ్రతంబులుసలిపియొకపుత్రునింబడసితి. వాఁడుసకలవిద్యలునేర్చుకొనియోగాభ్యాసంబులజిక్కుపడియుండుటంజేసి లౌకికంబు నెఱుంగఁడయ్యె. నేనింకనెవరికినిరాజ్యంబుగట్టుదు. అనిన విని యమ్మునీంద్రుండా రాజపుత్రునిందన సముఖంబునకురప్పించి యుతనితోనిట్లనియె. రాజాత్మజా,రాజయోగంబు శ్రేష్ఠంబనియును, రాజయోగ్యంబనియును,సుసాధ్యంబనియును నెఱుంగనేరక, హఠయోగపద్ధతులంజిక్కువడి కష్టంబులంబొందనేల? నీదగు పూర్వజన్మవృత్తాంతంబునే నెఱుంగుదు. తొల్లినీవొక మునిపు

త్రుండవై బదరికాశ్రమంబున ననేకవత్సరంబులు హఠయోగాభ్యాసంబుచేసినవాఁడవు. కాఁబట్టి నీవీ భువంబున రాజపుత్రుండవై జన్మించి యోగాభ్యాసంబులందే యాసక్తిగలిగి యున్నవాఁడవు. ఈజన్మంబునను రాజయోగివై యపరోక్షసాక్షాత్కారంబుననుభవింపకున్న నీజన్మంబునిరర్థకంబు.అనిన విని యారాజపుత్రుండుమిక్కిలివిషాదంబునొంది, మునివరా, నాయందుఁగరుణించి, నాకురాజయోగంబు తెలియంగఁజెప్పుమనిన, నాదేవమునియిట్లనియె.రాజాత్మజా, నీకుదెలుపునంతటిసావకాశంబు నాకులేదు. దేవేంద్రుండిప్పుడునారాకకై యెదురుచూచుచున్నవాఁడు. అయిననీకొకయుక్తిఁజెప్పెద, నీవు బంగాళదేశపురాజపుత్రియగు హేమకాంతామణియను జ్ఞానింబెండ్లాడి యాకాంతమూలంబున ముక్తికాంతనుం బొందుమని చెప్పి తిరోహితుండయ్యెను. అంతనారాజసుతుండునారదమునివాక్యంబులు వేదవాక్యంబులుగానమ్మి తనతండ్రితోఁజానాఖేటంబునకై పోవలయుననిి కొందఱు పరిజనుల నెంటఁగొని తనజననీజనకులయనుమతిఁబడసి పురి నిర్గమించెను.

ఇట్లా విజయకేతుండు పెక్కడవులందిరుగుచుఁ బెబ్బులులందునుముచు, శుండాలంబులతుండంబులు ఖండంబులుగాఖండించుచు,భల్లూకంబుల భల్లంబులం

బోడుచుచు, ఖడ్గంబులఖడ్గంబులం ద్రుంచుచుం, గి టులనీఁటెలం గ్రుచ్చుచునీరీతిననేకవిధంబుల మృగ యావిహారం బొనర్చుచుం బోయిపోయి, యొక్క వటవృక్షంబుక్రిందవిడిసిదన్నుంబరియనుసరించువారి నొక్కరినైనఁ గానక యొంటరియై యడవులను ము నిపల్లెలనుదాఁటిపోవుచు, మార్గంబున వన్యఫలం బులభక్షించి నీరుఁద్రావుచు, విహారంబునకై సెల యేళ్లప్రవాహములలో నీదులాడుచు, నరణ్యప్రదే శంబంతయుంగడచి, బంగాళదేశోపకంఠంబునఁజేరి రాజుచెంతకుంబోవనొల్లక నేవిధంబున నీహేమ కాంతామణిం బరిగ్రహింతునో యనిచింతించుచుం డఁగానచ్చటికిఁగొందఱుబ్రాహ్మణులేతెంచి, తాము రాజగృహంబునకుఁబోయి స్వయంవరానంతరము భూరిదక్షిణలంగొనవలయునని మాటలాడుచుండు వార్తలనాలించి వారిలోనొక్కనింగని, భూసురో త్తమా, యీయూరనేమి విశేషంబులనిన నాధరా మరుండిట్లనియె. 'అయ్యా, ఈదేశంబునేలుజయసే నమహారాజునకు హేమకాంతామణియను నొకపు త్రికగలదు. ఆకన్యారత్నమునకుస్వయంవరమహో త్సవంబెల్లి జరిగెడు.' అనవుడు నారాజపుత్రుండు యాబ్రాహ్మణునకు నమస్కరించి తనయశ్వంబునె క్కి స్వయంవరస్థానంబునకుంబోయి యందుఁగల నానాదేశపు రాజపుత్రులనుజూచి యచటనిర్మించి

యుండు హంసయంత్రముంగని దానిక్రిందఁజూ
ట్టుముకురమునువీక్షించి దానిప్రక్కనుండు బాణ
బాణాసనంబులంగని, యాజంత్రమును సమీపించి
దానుధరించినధనస్సునెక్కువెట్టిబాణసంధానంబుఁ
గావించి నెమ్మనమున నారద మహామునిని ధ్యా
నించి ధనుష్టంకారంబుఁగావించి దృష్టిముష్టిధారే
యుండై సమంత్రపూర్వకంబుగాఁబ్రయోగించిన
నాయాశుగంబున నగ్నిజ్వాలలుప్పతిల్లిచిటిలిపెటిలి
యనురవంబులతో మింటికెగసియాహంసనుగాల్చి
క్రిందఁబడవైచిన నచ్చటివారందఱును చేతులుతట్టి
మహనీయుండనికీర్తించువారును, మనల నవమా
నింపవచ్చెననువారును,సితఁడురాజమాత్రుండుగాఁ
డనువారును, నితండు హరుఁడో పురందరుఁడో లేక
రమావరుఁడో యనువారునునైరి. ఆజయసేనమహా
రాజునునల్లుని పట్టపుటేనుఁగుపైనెక్కించి యూ
రేగింపుగావించి తగువిడుదులనెలకొలిపి పురిశృం
గారంబుగావించి యొకశుభముహూర్తంబునదశ
విధవాద్యంబులతోడ నిరువురకు మంగళస్నానం
బులొనరించి వివాహమహోత్సవముగావించెను.
ఆయయిరువు రేయి పడకటింట నావిజయకేతుండు
హేమకాంతామణింగని, ప్రాణనాయకీ, నాకురాజ
యోగంబుదెలియుపద్ధతి నెఱింగింపుమనిన, నాబిస
రుహపత్రనేత్రి యాతనింగని, నాథా, కొన్నిదినం

ఖులుతడయుము, పిమ్మట మనమిరువురము నాదు గురుండగు దృశ్యమహామునిచెంతకరిగి, యతనిచే బోధితులమై యోగసిద్ధింజెందెదము. అనిన విని యాదృశ్యమునియెవండనియడిగి, యాతనినగస్త్య మునిపుత్రునిగానెఱింగి,సంతుష్టచిత్తుండై యుండె. అంతఁగొద్దిదినంబులకు "ఆడబోయినతీర్థ మెదుర య్యె" నన్నట్లులాదృశ్యమునీంద్రుండు నిజగృహం బునకు విజయముసేయుటంగని, యాతనినర్ఘ్యపా ద్యాది విధులంబూజించి, తనయంతిపురంబునకుఁ దోడ్కొనిపోయియుచితాసనంబునగూర్చుండనియ మించి పదంబులనొత్తుచుఁ దనపతియభిప్రాయంబు నెఱింగించె. అత్తఱి నావిజయకేతుం డతనికిఁ బ్రణ మిల్లి,మహాత్మా, నేనింతకాలము పంచముద్రలనభ్య సించుచుంటి కొన్నిదినంబులకుమున్ను నారదము నీంద్రుండరుదెంచి నేనభ్యసించుమార్గంబులు కష్ట తరములనియు, హఠయోగసంబంధములనియు నా వంటిరాజపుత్రులకు నర్హంబులుగావనియు,రాజ యోగంబునే గ్రహించుమనియుజెప్పియంతర్ధానుం డాయెను. కాఁబట్టిదేవరవారునాయందుఁగరుణించి మనోవిశ్రాంతినింబొందింపుఁడనిప్రార్థించిన,నాము నీంద్రుండుకడుసంతసించియాతనికినేనునీకుంజెప్పిన నీపరమహంసభావంబును, కుండలియోగంబునుబో ధించి,స్వస్వరూపానందముంబొందించి నిజేచ్ఛంజని

మెను. అంతనారాజసుతుండును నిజభుజబలపరా క్రమాతిశయంబునసకలరాజన్యుల గెలిచి, కీర్తిమం తుండై, హేమకాంతామాణినింగూడి యనేకసంవ త్సరములు రాజ్యమును బాలించి తుదకు నిరువురు విదేహకైవల్యంబునుంబొందిరి. కావున, నీవునునీ కుండలిమార్గంబునభ్యసించుచుండుము. అనిచెప్పె నని నవనిధర్మనందనుండు దేవస్థానమునీంద్రునకు నమస్కరించి, మునివతంసమా, పిమ్మట నెన్ని దినంబు లకు నా ముద్గలమహామునీంద్రుండు, శత్రుంజయమ హారాజునకుసచ్చిదానందలక్షణంబునెఱింగించెనో తెలుపుండనిన, నతండిట్లనియె.

గద్య॥ ఇది శ్రీమద్రమారమణచరణ సేవాముదితచారిత్రుం డును, సుధాకరవంశపయః పారావారరాకాసుధాకరుండును, ఆత్రేయగోత్రపవిత్ర-ఆదివెలమకులప్రసూనుండును, సకలనిగ మాగమవేద్యుండును, అచలుండునునగు పోకల-శేషాచలమునా యనివారిపుత్రుండగు, పోకల-వేంకటనరసింహారావునాయనిచే రచియింపంబడిన బ్రహ్మజ్ఞానచంద్రోదయంబను శత్రుంజయమ హారాజుచరిత్రమునందలి తృతీయాధ్యాయము.



## చతుర్థాధ్యాయము.

శ్రీమదనంతవేదాంతార్థవిదుండగు దేవస్థానమహాముని, యజాతశత్రునవలోకించి, పాండునందనా, అట్లు ముద్గలమునీంద్రుండు మానసత్రయంబులా శత్రుంజయుని నమనస్కయోగారూఢునిం జేసి, యాతనినిశ్చలవైరాగ్యంబునకుమెచ్చి, యాతనికి సచ్చిదానంద మార్గక్రమంబుం జెప్ప నుపక్రమించె.

### సచ్చిదానందలక్షణము.

రాజాత్మజా, "శ్లో॥ ద్రష్టృదర్శనదృశ్యానాం । విరామోయత్రవాభవేత్ । దృష్టిస్తత్రైవ కర్తవ్యం । ననాసాగ్రావలోకనం॥" అనుప్రమాణముంబట్టి, యేస్థానమునందు మానసేంద్రియంబుతోడ ద్రష్టయగు కారణస్వరూపుండును, జూడ్కియు, దృశ్యంబును విలయమగునో, యచ్చటనేదృష్టినిలుపవలయునుగాని, ముద్రాభ్యాసులతెఱంగున ముక్కుతుదను దృష్టినిలుపరాదు. దీనినే జ్ఞానామనస్కమనంబడు. దీనినే యాపోజ్యోతిదర్శనంబనంబడు. ఆపోజ్యోతియనఁగా శుద్ధచైతన్యుండగు,పరమాత్ముండు జలంబున బ్రతిఫలించిన స్వరూపంబు. దీనినే యార్యదర్పణయోగమనియు, సాక్షిస్వరూపదర్శనంబనియు నార్యులుచెప్పుదురు. ఇదిమిక్కిలి సునాయాసము, కావున ప్రపంచజ్ఞానంబునుమఱచి, శ్రీమన్నారాయణమూర్తియగు కారణ స్వరూపు

నింగనుము, “శ్లోకం॥ బహిరంతశ్చ భూతానా । మచరంచరమేవచ। సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం । దూరస్థంచాంతికేశతత్ ॥” అను ప్రమాణముంబట్టి యాబ్రహ్మంబు సమస్తచరాచరంబులయందుబహిరంతంబులనుండునదియు, సూక్ష్మస్వరూపంబై నదియుఁబ్రీలికమార్గంబునఁ దెలియుటకశక్యమైనదియు, నజ్ఞానికి దూరమైనదియు, జ్ఞానికిఁ గరతలామలకంబునునై యున్నది. అట్టిబ్రహ్మస్వరూపంబు నీకునెఱింగించెదఁ జూడుమని యార్యదర్పణంబున, “శ్లో॥ నీలతోయదమధ్యస్థా। విద్యుల్లేఖేవ భాస్వరా। నీవారశూకవత్తన్వీ। పీతాభాస్యాత్తనూపమా॥ తస్యాశ్శిఖాయా మధ్యే పరమాత్మావ్యవస్థితః॥” అను శ్రుతినిననుసరించి, నల్లకలువకు మధ్యభాగంబున సుషుమ్నయనునొక సన్నబిలంబుగలదు. అందు మహాకారణస్వరూపుండగు పరబ్రహ్మంబొండుగలదు. అందుండి మెఱుపుతీగవంటి ప్రకాశంబుగలిగి వడ్లగింజమొన విధంబున, నణుస్వరూపమై శుద్ధస్ఫటికాకృతిని వెలుగుచు, నంతర్బహిర్వ్యాపకత్వంబులుగలిగి, సూర్యచంద్రాగ్నులకుఁ దనకళలన్నియునిచ్చి తానునిష్కళస్వరూపుండై యుండును జూడుమని చూపించిన, నారాజనందనుండు దర్శనామాత్ర విభ్రాంతచిత్తుండై నిజమనోమారుతంబు లందైక్యపడుటచేఁగొంతసేపు ప్రాన్పడియుండి, పదంపడి, యాముద్దల

మహాఋషికినమస్కరించి, మునివరా, దీనినిజకంగావిశదపఱచుఁడని ప్రార్థించిన, నామునీంద్రుండిట్లనియె. మానసపుత్రా, "శ్లోకం॥ నాహంవేదైర్నతపసా। నదానేననచేజ్యయా। శక్యఏవంవిధోద్రష్టుం। దృష్టవానసిమాంయథా॥" అనుప్రమాణము ననుసరించి, యింతకుమున్ను నీవనుభవించిన స్వస్వరూపదర్శనము వేదపారంగతులకుగాని, తపోగరిష్ఠులకుగాని, యజ్ఞనిరతులకుగాని దుర్లభంబు. మఱియు, "శ్లోక॥ ఊర్ధ్వామ్నాయగురోఃపదంత్రిభువనోంకారాఖ్యసింహాసనం। సిద్ధాచార సమస్తవేదపఠితంషట్చక్రసంచారిణం। అద్వైతస్ఫురదగ్నిమేకమమలంపూర్ణప్రభాశోభితం। శాంతంశ్రీగురుపంకజంభజమనశ్చైతన్యచంద్రోదయం॥" అను ప్రమాణంబునుంబట్టి వేదవిదితంబును, ఓంకారసింహాసనంబున నధిష్ఠించినదియును, షట్చక్రసంచారియును, దనకు రెండవదిలేక, తేజోమయంబై ప్రకాశించునదియునునగు బ్రహ్మజ్ఞాన చంద్రోదయంబను శ్రీగురుస్వరూపమునుసేవింపుము. ఈచంద్రోదయ దర్శనమే బ్రహ్మసిద్ధి. దీనినే ప్రత్యగభిన్నాద్వితీయ పరబ్రహ్మమనియు నసంగత్వ, విభుత్వ, స్వచ్ఛత్వములచే నొప్పునదియనియు, జ్ఞానస్వరూపమనియు, నిర్వికారమనియు, నపరిచ్ఛిన్నానందబ్రహ్మమనియు, శుద్ధచైతన్యమనియు, నిరాలంబమనియు,

నంతర్బహిర్వ్యాపక తేజోమయమనియు, రాగాది విషయంబులనంటని ముక్తికాంతయనియుఁ జెప్పంబడును. ఇందు, “శ్లోకం॥ ప్రభాశూన్యం మనశ్శూన్యం బుద్ధిశూన్యంనిరామయం। సర్వశూన్యం నిరాభాసంసమాధిస్తస్యలక్షణం। త్రిశూన్యంయోవిజానీయాత్ సద్యోముచ్యతేబంధనాత్॥” అనుటచే, కానఁబడుచున్న దేహాదిసమస్తప్రపంచమున్ను, మనస్సున్ను, బుద్ధియును శూన్యమైనిరామయమగుచున్నది. ఇట్లు సమస్తమునుశూన్యమై నిరాభాసమైనదే సమాధిలక్షణమనంబడు. ఈశూన్యత్రయంబునెవఁడుదెలుసుకొనునో, యతఁడేముక్తుఁడనంబడు. అనినవిని శత్రుంజయుండుప్రముదిత స్వాంతుండై, గురువరా, యీకనుపించెడు సర్వసాక్షి స్వరూపంబు సూక్ష్మరూపమై యానల్లకలువలమధ్యనే కాన్పించుచున్నదిగాని,యఖండత్వంబునుంబొందినట్లు చూపట్టదు. మఱియు నవాఙ్మానస గోచరంబైన బ్రహ్మంబొండుగలదనిప్రసిద్ధి. అట్లుండ నీజ్యోతిస్స్వరూపం బింద్రియగోచరంబై యానందంబుగలుగఁజేయుచు సుఖంబునిచ్చుచున్నదిగాని యట్టిసుఖదుఃఖంబులులేని యఖండపరిపూర్ణంబుఁ జూపింపుఁడనివేడిన నాముద్గలమునీంద్రుండిట్లనియె.

పరిపూర్ణభావము.

మానసపుత్రా, నీదగుబుద్ధి సూక్ష్మతకును యు

క్తి విశేషంబునకును మెచ్చితిని. పూర్వజన్మసుకృతంబునం జేసి పూర్ణభావస్ఫురణ నీకుంగలిగె. ఇంతకు మున్ను నీకుఁ జెప్పిన జ్యోతిరూపకంబగు సచ్చిదానందము చేతనే యాపరిపూర్ణంబు నరయవలయు. అదెట్లనిన "శ్లో॥ ఉల్కా-హస్తోయదాకశ్చి । ద్ద్రవ్యమాలోక్య తాంత్యజేత్ । జ్ఞానేన జ్ఞేయమాలోక్య।పశ్చాత్ జ్ఞానంవినశ్యతి" యను ప్రమాణమునను సరించి యేప్రకారమొక వస్తువును వెదకుటకై దీపంబుచేఁబూని యావస్తువు దొరకిన వెనుక నాదీపము తోటి పని లేదో, యావిధంబున సచ్చిదానందంబును, శుద్ధయెఱుకయునగు జ్ఞానముచేత జ్ఞేయమను పేరఁబడిన పరిపూర్ణంబును దర్శింపవలయును. అనఁగా ఆకాశస్వరూపంబును శబ్దగుణకంబునునగు నాత్మనిచేత నాహోజ్యోతులను, వానిచే సర్వదోషరహితంబును, నామరూపరహితంబును, ద్వంద్వశూన్యంబునునగు పరిపూర్ణంబుఁజూపుము. "శ్లో॥ అమాత్రంశబ్దరహితం స్వరవ్యంజనవర్జితం । బిందునాదకళాతీతం యస్తంవేదసవేదవిత్॥" అనుటచే హ్రస్వదీర్ఘప్లుతాది శబ్దంబులకతీతమైనదియు, నక్షరంబులతోఁగూడిన పదవాక్యంబులు లేనిదియు, మూలప్రకృతియనందగు బిందువును ప్రకృతియనఁబడునాదంబును, కళాస్వరూపంబగు నాహోజ్యోతిని నతిక్రమించినదియు, నగు పరిపూర్ణమును . నెవ్వఁడెఱుంగునో యతఁడే

వేదాంతతత్వజ్ఞుండనంబరగు. "శ్లో॥యదేకంనిష్క
ళంబ్రహ్మ। వ్యోమాతీతంనిరంజనం।అప్రతర్క్యమవి
జ్ఞేయం। వినాశోత్పత్తివర్జితం॥" అనుప్రమాణము
చేత నేదిసజాతీయవిజాతీయస్వగతభేద శూన్యమై
కళలులేనిదై యాకాశమను శబ్దగుణకమునుమీఱి
నదై, సర్వదోషరహితమై యవాఙ్మానసగోచరం
బై, శ్రుత్యుక్తులచేఁ దెలియఁగూడనిదియై, చావు
పుట్టుకలులేనిదై నిండియున్నదో, దానినేబట్టబయల
నంబరగు పరిపూర్ణంబనిచెప్పంబడు. అనికనుసౌజ్ఞ చే
నచలంబును, నవ్యయంబును, ననంతంబును, నసం
గంబును, నలిప్తంబును, నగునిత్యసత్య శుద్ధపరిపూ
ర్ణబ్రహ్మంబును నెఱింగించి, మానసపుత్రా, "జగ
న్మిథ్యాబ్రహ్మసత్య" మనెడుప్రమాణముచే, కల
యందుఁగానుపించు నామరూపాదుల తెఱంగున
పంచభూతాత్మికంబగు నీప్రపంచంబు మిథ్యాస్వరూ
పంబు. సర్వశూన్యంబగుపరబ్రహ్మమనంబడునీబట్ట
బయలు జాగరణస్వప్నసుషుప్తి తుర్యతుర్యాతీతం
బులయందును నశించక స్వతస్సిద్ధమైయుండును.
ఈబట్టబయలునకంటె నొండేమియులేదు. నీకుఁగా
నుపించు నామరూపాత్మికంబగు నీప్రపంచంబునిలు
కడగా నిలుచునదిగాదు. "యదృశ్యంతన్నశ్య"
మనుటచేత నేయేవస్తువులు చూడఁబడుచున్నవో
యవియన్నియు నీటిబుగ్గలచందంబునమటుమాయ

ములై పోవుచున్నవి. “శ్లో॥ ఇంద్రజాలమిదం సర్వం। యథామరుమరీచికా।అఖండితమనాకారం। వర్తతే కేవలంశివం॥” యనుప్రమాణముంబట్టి యింద్రజాలంబుభంగింజూపట్టునీసమస్తప్రపంచమున్ను మృగతృష్ణయుంబోలె నస్థిరంబై కేవల పరిపూర్ణంబును, నద్వితీయంబును, మంగళస్వరూపంబుననగు, పరబ్రహ్మంబుమాత్రము సర్వకాల సర్వావస్థలయందును దోచుచుండును. ఇందుకుసందియము లేదు. నీకు సంశయంబుగలిగినయెడలఁ జెడిపోదువు. “శ్లోకం॥ అజ్ఞశ్చాశ్రద్ధధానశ్చ।సంశయాత్మావినశ్యతి।నాయం లోకోస్తినపరో।నసుఖంసంశయాత్మనః॥” యనుశ్లోకము ననుసరించి జ్ఞానహీనుండున్ను నశ్రద్ధగలవాఁడును, సంశయాత్ముండును జెడిపోవుదురు. సంశయమనస్కునకు నిహపరలోకంబుల సుఖంబులుగలుగవు. సంశయమునొందుటచే నెంతటిగురుభక్తుఁడైనను దుర్గతింబొందును. ఇందులకొక్క యితిహాసంబుగలదు వినుమనియిట్లనియె.

దృఢచిత్తుండను జ్ఞాని-సందేహించినకథ.

రాజనందనా, తొల్లికర్ణాటకదేశంబునకనతిదూరంబుననుండు నొకమఠంబున దీర్ఘసాధుండను నొకమునిపుంగవుండుగలఁడు. అతఁడు శాంతిసమన్వితంబగు నీజగంబును దబ్బరగానెంచి, క్షేత్రక్షేత్రజ్ఞాతీతంబగు పరిపూర్ణమునందెనిండియుండెను. అత

నికి బ్రహ్మచారియు, శమాదిసద్గుణాన్వితుండును, మహాయోగియునగు దృఢచిత్తుండను పేరుగల నొక శిష్యుండు, పూర్ణభావంబునుంగోరి, వివిధశుశ్రూషలొనర్చుచుండెను. ఆగురుండునుదనకు సాధనసంపత్తిగలశిష్యుండబ్బెనని సంతసించుచుండెను. ఇట్లు దృఢచిత్తుండు సద్గురువును పరబ్రహ్మస్వరూపముగా భావించి, సర్వలౌకికధర్మంబులవిడనాడి, గురుపాదమేగతియని యాతనిననేకవిధంబులసంతుష్టినిఁగాఁ జేయుచుండెను. ఈవిధంబునబండ్రెండువత్సరంబులు గడచినపిమ్మట దీర్ఘసాధుండు శిష్యునిదృఢచిత్తంబునకుమెచ్చి యాతనింజీరి, మానసపుత్రా, నీవు మిగుల సూక్ష్మబుద్ధిగలవాఁడవగుటంజేసి, నీవెఱింగియున్న యాపోజ్యోతులచేత నీపరిపూర్ణబ్రహ్మమును దర్శింపుమని కనుసాజ్ఞ సేయ, నాదృఢచిత్తుండొక ఱెప్పపాటుకాలంబులోగ్రహించినవాఁడయ్యెనునా స్వరూపంబు-నామరూపరహితంబగుటంజేసి, యేమి చెప్పను జాలనొక,యింతేగదాయనియలక్ష్యంబునను సందేహంబుననుబలికెను. అంతనాగురుండు, (నమ్మినవానినట్టేటవిడుచుటమేరగా) దనులోకోక్తి చేఁదన్నుబండ్రెండుసంవత్సరంబులుగాగాచిశుశ్రూషలొనరించుచున్న శిష్యుని వ్యర్థముగాఁబోనివ్వరాదనుతలంపున, నప్పుడు శిష్యునింగని, మానసపుత్రా, ఇంతియగాదు. ఇంకనునున్నయది. నీవుపం

దేహింపంబనిలేదనియును, బిమ్మట బోధించెదనని యునుజెప్పెను. అందుకాశిష్యుండు తనమనంబునం గలిగిన సంశయంబును విడిచి, సద్గురు కటాక్షంబు నకై యెదురుచూచుచుండెను. అంతంగొన్ని దినంబులకు నాదీర్ఘసాధునకు నంత్యకాలంబు సమీపించు నాగురుండు శిష్యునవలోకించి, మానసపుత్రా, హంసచక్రంబుల నతిక్రమించి, యీబొంది నుండి వెడలిపోవునట్లున్నయది, నీవుత్వరగాఁబోయి కొంతవేడినీళ్లుదెమ్ము, మిక్కిలి తాపమగుచున్నదీ, యనినవిని యాదృఢవ్రతుండుపాత్రనొకటిఁ బుచ్చుకొని యూరిలోనికింబరుగిడెను. ఇంతలోనాదీర్ఘసాధుండుతనశిష్యుఁడువచ్చునంతదనుకదనప్రాణములు నిలువవనినిశ్చయించి, తనప్రక్కనుండునిసుకభూమిమీఁద, ‘‘శిష్యతిలకమా, నేను నీకుబోధించినదానికంటె వేరొండులేదు. ఈమాయయెటుకకుమూలములేదు. పరిపూర్ణమగు నీబట్టబయలేసత్యము. ముందునీమనస్సుచంచలవృత్తినుండుటచేత నాబోధకోటికివైచిన జల్తారుకుళ్లాయివిధంబున నిరర్థకంబయ్యె’’నని వ్రాసి తాను నేత్రములను మూసికొని ప్రాణములవిడిచెను. అంతఁగొందఱు దొమ్మరవాండ్రాత్రోవను బోవుచు వారిలో నొక దొమ్మరది యచ్చట వ్రాసియున్న వాక్యంబుల నొక తాళపత్రంబుపై వ్రాశి యాకమ్మను తనకుడిచెవినింబెట్టుకొని,

యావాక్యంబులఁ గొన్నింటినిం దుడిచివైచి, తన వారింగూడిపోవుచుండెను. ఇట నాదృఢచిత్తుండు పరుగునవేడినీళ్లుదెచ్చి, తనగురుండు ప్రాణములను విడిచియుండుటంజూచి, మిగులదుఃఖితుండై యా తనిప్రక్కనవ్రాసి తుడిపియున్నవాక్యములనుజక్క గాఁదెలియకుండుటకై వగచి, యచ్చట మేకలం గాచుచుండెను గొల్లపిల్లవానింగని, ఓరీ, యీమా ర్గంబుననెవరుపోయిరనియడిగిన, వాఁడు, అయ్యా, యొకదొమ్మరది యీమార్గంబునంబోవుచు నిందే మోవ్రాసుకొని యాతాటాకును గుడిచెవినింబెట్టు కొని యిట్లుత్తరముగాబోయె'' ననినవినియాదృఢ చిత్తుఁడు తనలో, నకటా!సద్గురుఁడిచట నానిమిత్త ముగా నేమివ్రాసెనో, తెలియదు. అట్టిరహస్య వాక్యంబుల నాదొమ్మరది వ్రాసుకొని తుడిపిపో యెను. దీనినేనెట్లుసాధించుట, యెట్టులైనగురునకు సమాధిక్రియలుజరిపి పిమ్మట దానిబరియనుసరించి, దానికి శుశ్రూషలైనఁజేసి, మనకార్యంబుసాధింప వలయుననితలపోసి, సద్గురునకు సమాధిక్రియలునె రవేర్చి. నలువదిదినంబులాసమాధిపై, ధూపదీప నైవేద్యములాదిగాగల పూజలొనరించుచు,నచట నేశయనించుచు, నీవిధంబున నలువదిదినంబులుగ డపి, తదనంతరముప్రయాణమై యుత్తరపుదిక్కు నుంగూర్చిపోవుచు, నచ్చటచ్చట వారిపోబళ్లవిచా

రించుచుం బోయి పోయి యారుమాసంబులకును జ్జయినీపట్టణంబున వారినింగనిపట్టి యాదొమ్మరది చెవినిధరియించియున్న క్రొత్తతాళపత్రంబుంగని, యదియ తానుగోరిన పత్రంబుగానిశ్చయించి, తన లో, “ఔర! దీనిచెవినుండు కమ్మనెటులగ్రహించుట, నిద్రించుచోఁ బుచ్చుకొనియెదనన్న ద్రోహంబును, నడిగెదనన్న నదిగోపించుననుభయంబును; నాము దీఁదాఁకినొంచుచున్నయది, దీనినెట్టులేనిమంచితనం బునఁ గొనవలయు,” ననియెంచి, యాదొమ్మరదా నిం జేరి, యామెకునమస్కరించి “యమ్మా, నేను దిక్కులేనివాఁడను. మీయొద్దనుండి డోలువాయిం చెద” నని ప్రార్థించి దానిసమ్మతింబడసి, వారితోఁ గూడ దేశదేశంబులకుంబోవుచు, వారాడునపుడు డోలువాయింపుచు, వారైయొసఁగినయాహారమును గుడుచుచు, నీవిధంబున నైదువత్సరంబులుగడిపి, తుదకుఁ బాంచాలదేశంబునుం జేరిరి.

ఆపాంచాలదేశంబును బాలింపుచుండిన చిరకీర్తిమహారాజుమిక్కిలిసత్యసంధుఁడై దానశీలుఁడై ధర్మయుక్తంబుగఁ బ్రజారక్షణంబుసేయుచుండ, నొకనాఁడారాజసభకు నంగీరసుండను మహామునియే తెంచినంగాంచి యెదుర్కొనితోడ్తెచ్చి యవారా సనంబునం గూర్చుండఁబెట్టి యాతనినర్ఘ్యపాద్యాది విధులంబూజించి క్షేమవర్తమానంబుల నడిగిన,

నతండు మిక్కిలి సంతసించి, "ధారుణీశా, నీవు మహాదాతవని లోకులచేఁ బ్రశంసింపంబడియును, 'నాన్నోదకసమందానం' అనుటచేనీవెన్ని దానంబులుచేసినను నన్నోదకదానంబులకు సమానంబులు గావు, కావున నీవిటపైనొకయన్నసత్రంబుగట్టించి యెల్లరకును నాత్మసంతుష్టిఁగావింపుము. అందు సత్పాత్రదానంబు సేయుటచేత నైహికాముష్మిక సుఖంబులొదవు, ననిన, నాచిరకీర్తి యాతనికినమస్కరించి, ఋషిశ్రేష్ఠమా, పాత్రాపాత్రంబులనెట్లు తెలియుట, దానికిందగిన యుపాయంబు చెప్పుఁడనిన నామునివరుండిట్లనియె. 'రాజోత్తమా' నేననీమేడయందొకగంటఁగట్టించెద, నీవుప్రతిదినంబునునన్నదానంబుసేయుచుండుము. ఈగంటతనంతఁటదానె న్నడుమ్రోగునో, నాటికొకసత్పాత్రయగు పురుషుండు భుజియించెననుకొమ్ము.' అనిచెప్పిగంటనుగట్టించిపోయెను. అంతనానరేంద్రుఁడు మహర్షివాక్యంబులుసత్యంబులుగానమ్మి, యొకయన్నసత్రంబునుగట్టించి ప్రతిదినంబును వేలకొలఁదిజనంబులకు నన్నదానంబుచేయుచుండెను. ఇట్లుపండ్రెండు సంవత్సరములు నన్నసంతర్పణఁజేయుచుండియు నొక్కనాఁడైనను నాగంట మ్రోగకుండుటకై చింతించి, తనమంత్రియగు మేధానిధింజూచి, "యమాత్యవర్యా,కొందఱుసోమరితనంబుచేతను, దారిద్ర్య

ముచేతను, పురవాసంబువిడనాడి తలలును, గోళ్ల ను, గడ్డములనుబెంచుకొని, లోకోపకారులుగాక, మానులమని వనవాసులై చరింపుచుందురు. అట్టి వారిబూటకపుమాటల పాటిగానెంచి యీగంట నొకటిగట్టించితి, వారివాక్యంబులు నమ్మఁదగినవి గావు, నీవేమిసెప్పెద”వనియడిగిననామంత్రివరుం డిట్లనియె. రాజోత్తమా, మహాఋషుల వాక్యంబు లసత్యంబులుగావు. ఈగంట మ్రోగునట్టిసత్పాత్ర యిదివరకు సంభవించియుండఁడు. వేలకొలఁది యపాత్రులగుజనులు భుజియించినను నొకసత్పా త్రకు సమానంబుగాదు. కావున మనముశాంత ముగా నింకను విచారింతమనిపలికెను.

అంతంగొన్ని దినంబులకు నాదొమ్మరవాండ్రీ యూరఁజేరియచటగూడెముగావించుకొనియుండి, యొకనాఁడాదొమ్మరది దృఢవ్రతుఁడు మిక్కిలియగ్గి దాఁకియుంటంగని, యయ్యా, నీవుమిగుల నాకొని యున్నావు. ఇచటభుక్తమగుటకుఁ జాలాసేపగు. నీవీయూర నుండుసత్రంబునకుం బోయియడిగిన, నీకు నాహారమిత్తురుపొమ్మనిన, నాతండును, వల్లె యని సత్రంబునకుంబోయి, యచ్చట వంటచేయు వారు సంతర్పణతీఱినపిమ్మటతత్పాత్రల శుద్ధిచేయు చుండఁగాఁగని, వారినినన్నంబడిగినవారునంతయు దీఱియు నలనిపైఁగరుణించి, మాఁదన్నము గొంత

యుండినం దెచ్చియిచ్చి యంపిరి. ఆదృఢచిత్తుండు దానింగొని యొకకొలనుచెంత కరిగి యచటదానిం గుడిచి, నీరుఁద్రావి, గూడెంబునకుంబోయెను. ఇంతలోనాగంట తనంతటఁదానుగొప్పధ్వనితో మ్రోగినవిని, యాపృథ్వీశుండును, మేధానిధియు నచ్చెరువంది చయ్యననన్నసత్రంబునకరుదెంచి, యచ్చట వంటచేయువారింజూచి, "యిచ్చటెవ్వరైననిపుడు భుజియించియుందురా" యనియడిగిన, నావంట వారు, "మహాప్రభూ, మేముసంతర్పణదీఱి పాత్రలు శుద్ధిచేయుతఱినొకభిక్షుకుండువచ్చియన్నమడిగెను. మేము మిగిలినమాడన్నమును నిచ్చిపంపితిమి, ఇంతియగాని, వేఱొకనికిని నన్నముపెట్టినవా రముగా" మనిపలికిరి. అంతనారాజువారినింజూచి "రేపటికినే సమయముననైననువచ్చి యతఁడన్నంబునడిగిన, లేదనిచెప్పక యుందుగానాతనికివడ్డింపవలయు."ననియాజ్ఞాపించి,నిజప్రాసాదంబునకేగెను. ఆమరునాఁడుదయమున నాదొమ్మరది, యాదృఢచిత్తునింగని, యయ్యా, నేఁడును నాసత్రంబునకే కొంతముందుగాఁబోయినఁ, దృప్తిగా భుజియింపవచ్చు" నని యాతనిసత్రంబునకుంబంపెను. అట్లాదృఢచిత్తుండు సత్రంబునకుంబోయి యన్నమడిగిన, నావంటవాం డ్రాతనింజూచినతోడనే, రాజాజ్ఞనుజ్ఞప్తికిం దెచ్చుకొని మిక్కిలి వినయంబుతో

నాతనికిఁబాద ప్రక్షాళనంబునకై జలంబులఁగొని తెచ్చియిచ్చిపీఠంబుపైఁగూర్చుండనియమించి,పెద్ద విస్తరవైచి, తిన్నఁగావడ్డించుచు,నాతనిరాక యువ నీశునకునివేదింపనొక్కనింబంపిరి.దృఢచిత్తుండును, దనవిస్తరియందుంచిన యన్నంబును బదార్థంబుల నన్నింటిని నొకటిఁగా నేతితోఁగలిపి, సద్గురున కర్పితంబుగా మొదటికబళంబునుమెసవిన తోడనే గంటమ్రోయ నారంభించెను. ఆసమయంబునరా జును మంత్రియునరుదెంచి, యెదురుపడినలేచిపోవు ననుశంకచేయుతండు భుజించుపర్యంతముమఱుఁగు పడియుండిరి. అతండు భుజించునప్పుడెల్ల నొక్కొ క్కకబళంబునకును నొక్కొక్కతూరి గంటమ్రో యుచుండెను. ఇట్లు ప్రతిగ్రాసంబునకును గంట మ్రోగుటకు రాజును మంత్రియు నచ్చెరువంది,యి తఁడేమహాత్ముండనితలంచుచునాతఁడుభుజించినతో డనే యాతని నాలింగనముచేసికొని మామందిరం బునకు విచ్చేయుఁడనివేఁడిన నతండిట్లనియె, "రా జోత్తమా, నేనుదొమ్మరవాండ్రయొద్దడోలువాయిం చువాఁడను." అనినవిని పుడమిఱేఁడచ్చెరువంది, మహాత్మా, నీవంటిపుణ్యాత్ములు దొమ్మరవాండ్రవద్ద డోలువాయింపవలసినకారణంబేమొకో, తెలుపుఁ డనిన, నాదృఢచిత్తుండు రాజుంజూచి. "మానవేం ద్రా నేను పండ్రెండుసంవత్సరములు దీర్ఘసాధుం

డను మహామునికిశుశ్రూషలొనరించి సకలవేదాంతధర్మంబులఁదెలిసితి. అతనికంత్యకాలంబు ప్రాపించుడునన్ను నీళ్లకై బంపినేవచ్చునంతలోఁ గొన్నివాక్యంబుల భూమిపై వ్రాసి పరమపదముంబొందెను. ఇప్పుడేఁగొలుచు దొమ్మరదితద్వాక్యంబులనొకతాళపత్రంబునవ్రాసి కుడిచెవింబెట్టుకొనియున్నయది. అదిమొదలు నేటిదనుక దానినేగొలుచుచు నదిగొసంగిన భుక్తమును భుజించుచున్నవాఁడను. ఇప్పటికినారుసంవత్సరంబులాయెను. ఇంకను నాకమ్మసంభవింపకనేయున్నయది. ఆకమ్మనుఁదెప్పించియిచ్చిన నేనెందునుబోవువాఁడనుగా" ననిచెప్పిన నతండల్లెయని యాతనివిడిపించి, "పుణ్యాత్మా, యాకమ్మను బొందినపిమ్మట నాదుముద్యానవనంబునకు వచ్చియుండుఁ" డనిప్రార్థించి యాతనిసెలవుపొంది నిజమందిరంబునకుంజనికొండఱువర్తకులచేరెండుజతల వజ్రములకమ్మలఁదెప్పించి, యాదొమ్మరవాండ్రను రప్పించి తనదుకట్టెదుట నాడనుత్తరువిచ్చెను. ఆ దొమ్మరిదియుగడనెక్కి యాడుచుండఁగానాదృఢచిత్తుండు, "వహవా-సేబాసు" అనిడోలువాయించుచుండ, నాపృథ్వీశుండును సంతుష్టుండునుంబోలె నాదొమ్మరదాని గడనుండిదిగిరమ్మనిదానియెదుటఁ దానుఁదెప్పించిన రెండురవలకమ్మలనుబెట్టి వీనిధరించుమనిన నాగరితయత్యానందంబుతోఁదన చెవి

నున్న తాటాకుకమ్మలనుబారవైచి యాకమ్మలనుధ రియించి తనవారింగూడిపోయెను. ఇంతలో నాదృ ఢచిత్తుండు దొమ్మరదిపారవైచినకుడిచెవి తాటాకు కమ్మనుంబుచ్చుకొని యుద్యానవనంబునకుంబోయి, యందు దానింజదివిచూచుకొని మిక్కిలి చింతా క్రాంతుండై తనబుద్ధిలేమికై వగచి మున్నుదాను బొందినభావంబునుదనమనంబునదృఢపఱచినంతో షానందంబునుబొందుచుండఁగానచ్చటికినాచిరకీర్తి మహారాజునుమేధానిధియనుమంత్రియువచ్చి యా తనివెంటఁబెట్టుకొనిపోయి మిక్కిలి భక్తితాత్ప ర్యంబులతోఁబూజింపుచు నాతనికి నొకమఠము నుగట్టించి యనేకవిధంబుల శుశ్రూషలొనరించు చుండిరి. కావుననీవేసందియంబును మనంబుననుం చవలదు. ఈపరిపూర్ణమునకంటెన్ను వేరొండులే దు, ఈబట్టబయలే సర్వంబునునిండి నిబిడీకృతంబై యున్నయది. ఇదియేవేదాంతము. ఇదియేనీనిజస్వ రూపము. ఇంతకంటెనునేమిలేదు. దీనినినమ్మకమతి వేఱుదానినమ్మిన జన్మశూన్యముగానేరదు. దీని నె ఱింగినవాఁడు సంసారమున జిక్కువడియుండినట్లు తోఁచియుఁదామరాకుపై జలబిందువులవలె సంసా రంబులంజిక్కువడడు. నీవు నీస్వదేశంబునకుఁబో యి మాతాపితలను సంతుష్టులంజేసి ధర్మపత్నివ లన పుత్రీపుత్రులను బడసి ప్రజాపాలనంబుసేయు

చుండుము. అని ముద్గలమునీంద్రుం డానతిచ్చిన విని యాశత్రుంజయుండు ప్రముదితస్వాంతుండై, సద్గురువర్యా, మీకటాక్షంబునం జేసి నేధన్యుండనైతి నాసంశయంబులెల్లఁదీఱెను. నిజస్వరూపమునుబొందితినని సాష్టాంగనమస్కారంబుగావించి, యాతని దీవనలను నుత్తర్వునుబడసి, నిజపురాభిముఖుండై వచ్చుచుండెనని చెప్పిన విని పాండవాగ్రజుండు దేవస్థానమునీంద్రునకు నమస్కరించి, మునిరత్నమా, ఆశత్రుంజయమహారాజుయొక్క యావలివృత్తాంతంబు నెఱింగింపుఁడనిన నతం డిట్లనియె.

గద్య॥ ఇది శ్రీమద్రమారమణచరణ సేవాముదితచారిత్రుండును సుధాకరవంశపయః పారావారరాకాసుధాకరుండును, ఆత్రేయగోత్రపవిత్ర ఆదివెలమకుల ప్రసూనుండును, సకల నిగమాగమవేద్యుండును, అచలుండునునగు పోకల-శేషాచలమునాయనివారి సుపుత్రుండునునగు పోకల-వేంకటనరసింహారావునాయని చేరచియింపఁబడిన, బ్రహ్మజ్ఞానచంద్రోదయంబను శత్రుంజయమహారాజుచరిత్రమందలి, చతుర్థాధ్యాయము.





## పంచమాధ్యాయము.

శ్రీమదద్వితీయ బ్రహ్మోపరోక్షస్వాను భూతుండగు, దేవస్థానమునీంద్రుఁడు పాండవాగ్రజునింగాంచి, ధర్మరాజా, అట్లుశత్రుంజయుండు ముద్గలమహాఋషివలన నంపఁబడి తనపురంబునకునువచ్చుచు, మధ్యేమార్గంబున దట్టంపుటడవులలోఁజొచ్చి యందుసంభవించిన ఫలంబులభక్షించి, జలపానంబుసేయుచుఁ దన కనతిదూరంబునం గనుపించు నుద్యానవనంబునకుంబోయి, యందు విచిత్రబింబ సురలతా చంపకసుగంధతిలక మాకందాది నానావిధపాదపంబులునుగలిగి, తదంతరంగంబునఁదామరసకువలయ కల్హారాది పంకజమనోజ్ఞంబును, శశికాంతశిలానిర్మిత సోపానవ్రజంబును, వనమయూరమత్తకోకిలహంసశ్రేణి క్రౌంచపరివృతంబునునగు హ్రదంబునుగని, యందలిత్తేట చల్లనినీరుద్రావి, యాసమీపంబుననుండు స్ఫటిక శిలామయంబగు మంటపంబునవలోకించి యచటికింబోయి యిందున్న చారువదనలఁగొందఱింగని, "యోయిందుముఖులారా, మీరెవరు? ఈదుర్గమప్రదేశంబుననుండుటకుంగారణంబేమి? నిజమెఱింగింపు" డనిన, నాసుందరు, "లయ్యా, మేము నేపాళదేశపురాజపుత్రి చెలికత్తియలము. ఆరాజబింబానన యీగనుపించు కొండగవియందు నొకవిచిత్రంబగు హ

ర్మ్యంబును నిర్మించుకొనియున్నయది. అయ్యా, నీ విచటికేలవచ్చితివి? మారాజపుత్రికిం గావలియున్న భూతమొకటి యీయరణ్యంబునకువచ్చు, మగవాం డ్రనెల్లరంబట్టి మ్రింగుచుండు. త్వరితంబుగనీవచ్చి నదారిం జూచుకొనిపొమ్ము. లేకున్న ముప్పుగలుగు" నని చెప్పిరి. అంతనారాజపుత్రుండు చిరునగవుతో వారింగని, "కాంతామణులారా, మీమాటలచే తనే భయపడు పిరికిబంటునుగాను. మీరునావిష యమై సంశయమునుబొందక, మీరాజపుత్రివృ త్తాంతంబుసాంగంబుగానెఱింగింపు"డనిన, నాచె సరుహాక్షులు, రాజపుత్రునింజూచి, "రాజేంద్రా, మారాజపుత్రి సుందరలావణ్యగుణ విశేషంబుల వర్ణించిచెప్పుటకు శేషాహికైనదరముగాదు. అలల నామణి రాజపుత్రులనేరిని వివాహముచేసికొనన నొల్లక, జననీజనకులమాటలనుల్లంఘించియుండుట చేత వారుచింతిల్లిదేవేంద్రునిం బ్రార్థించిరి. అపాక శాసనుండరుదెంచి, నన్నుం బ్రార్థించుటకు గతంబె మ్యేదియనియడిగి, మారాజపుత్రివృత్తాంతంబంత యునరసి, యామెమేడకుంబోయి, యామెను దన తొడలమీందం గూర్చుండం బెట్టుకొనిముద్దిడి, "పు. త్రికారత్నమా, నీవునావరప్రసాదంబునంబుట్టియు, నాకపకీర్తిగలుగునటుల నీతల్లిదండ్రులమాటలవినక యుండుట ధర్మమ్మగాదు. ప్రస్తుతంబున నీకుందగిన

వరుండులేకుండుటనిశ్చయంబు. నీకునీజననీజనకుల నిర్బంధము లేకుండునట్లు లీసమీప కొండగవి నొక్కమేడనిర్మించెద. నీకురక్షణకై యొక్కభూతంబునుగల్పించిగుహాయందుంచెద. ఏపురుషుండా భూతంబునుద్రుంచినీయంతఃపురంబునకువచ్చునో, యామహాత్మునింబరిణయంబగుము. అంతపర్యంతమునీసుకుమారతయు,యౌవనంబునుచెడకయుండును. నీవునీచెలికత్తియలతోడఁగొండవెలుపలనిర్మింపంబడునుద్యానవనంబునవిహరింపుచు, సంతోషంబుతోనుండు" మనిచెప్పి తనయాజ్ఞను మహారాజునకునుదెలిపి, దివంబునకరిగెను. అదిమొదలుకొని మేమును, మహారాజపుత్రియైన హేమకాంతామణియు, నిచటనున్నారము. మహారాజును రాణియుఁ దమపుత్రిక్షేమంబులనరయుటకై నెలకొకతూరివచ్చువారు. ఈహేమకాంతామణినిమిత్తమై యనేకగంధర్వయక్షరాజసైన్యంబులును, పెక్కులగు రాక్షససైనికనికాయంబులునుమడిసెను. కావున మీరాలస్యముచేయక యీచోటువిడిచిపొండు, లేకున్న ప్రాణాంతంబెసంభవించు" నని చెప్పినవిని యారాజపుత్రుఁడు తనమనంబున వీరరసంబుపెలుగఁ జయ్యన నాకొండగండియందకుంజని, యందొకబండపైఁబండుకొనియుండు గండుమిగిలినభూతంబునుంగని,ధనుష్టంకారంబుగావించిన,నాభూత

చిత్రరథుండు వీరాకొక్క సందేశంబుఁ బంపెనని యిట్లు చెప్పుచున్నాఁడు. రాజోత్తమా, నీవు భూతంబును జంపి, హేమకాంతామణినింగొనిపోఁదలంచి, నీసాహసంబులఁ బ్రకటించి యాపెనుభూతంబును గీటడంచితివి. నేను ననేకదినంబులనుండి యీనేపాళరాజ తనయను జేకొనఁ బ్రయత్నించియు నయ్యది యాభూతంబునం జేసి నమకూరదయ్యె, నీవు మేటివిలుకాఁడవై యామదాంధభూతంబును జంపితివి. నీశౌర్యంబుపొగడఁదగినదేః అయిన నిప్పుడా రాజపుత్రిని నాకిప్పించి, నీవిలువిద్యకుందగిన ఘనదనమునుగొనిపొమ్ము, లేకున్న యుద్ధమునకురమ్ము." అనిన, నాశత్రుంజయుండట్లే యుద్ధంబునకువచ్చెద నని చెప్పియంపెను. ఆగంధర్వనాయకుండగు చిత్రరథునిమిత్రుండగు చిత్రసేనుం డాశత్రుంజయుని తోఁదలపడి, వృత్రాసురేంద్రులకైవడిఁబోరుచు, ననేకదివ్యబాణంబుల నొండొరులఁ బ్రయోగింపుచు, నీరీతిదారుణంబగు యుద్ధంబు సేయుచుండ, చిత్రాంగదుండను గంధర్వుండు తనమిత్రునకుసహాయుఁడై యాశత్రుంజయునిపై నాగ్నేయాస్త్రంబుఁ బ్రయోగింపనది ప్రళయాగ్నియుంబోలె చిటపెట శబ్దంబులతోమండుచు వచ్చుచున్నం జూచియారాజసూనుఁడు దానిని వారుణాస్త్రంబునం జల్లార్చె. వారిరువురిపై తీక్ష్ణనారాచంబులఁ బ్రయోగించినొ,

ప్పించిన నాచిత్రసేనుండునాగాస్త్రంబును,చిత్రాంగదుండు తిమిరాంబకంబును బ్రయోగింప, వానివలన భుజంగవ్రాతంబును, జీకట్లును గలిగిన, నాశత్రుంజయుండు వెనుదీయక, వెంటనే గారుడాస్త్రంబును, భాస్కరాశుగంబును బ్రయోగించి, యానాగతిమిరాస్త్రంబుల రూపుమాపి, వారిని రోహణకోరలవంటిబాణంబులచే నొప్పింప, నాచిత్రరథమిత్రులిరువురు, భయాకులితచిత్తులై పాఱినంగని, యారాజనందనుండు తక్కినసైన్యంబులపైఁ బ్రేతాగ్నినామకంబగునస్త్రంబునడరించిన,నదికల్పాంతాగ్నికీలలచందంబున విజృంభించి యాసైన్యంబుదహించుచుండిన, నాహతశేషులు చిత్రరథునిపాలికిఁ బరుగిడినంగాంచి, యాగంధర్వరాజు దానిని సర్వతోముఖంబను నస్త్రంబున వారించి యతనిమీఁద రాక్షసాస్త్రంబుఁ బ్రయోగింప, నారాజపుత్రుండా నవీనాస్త్రంబు నంజనించిన, రాక్షసానీకంబునుజూచి యచ్చెరువడి, దానిపై నారసింహాస్త్రంబునుం బ్రయోగించి, యాచిత్రరథునిం బెక్కునారసంబుల నొప్పించిన, నాచిత్రరథుండుమిక్కిలికోపించి, యాతనిపై నొకశక్తిం బ్రయోగించెను. ఆశత్రుంజయుండు దాని వికృతాకారంబునుంజూచి భయంపడక, తనకుఁ బాకశాసనుండొసంగిన, సర్వశక్తినాశకంబను నస్త్రంబునుం బ్రయోగించి, యాశక్తిని

రూపడంచి, యాచిత్రరథునినుదుట నొక్కటియు, నురంబునరెండును వాఁడికోలలంజొనిపి, తక్కినసైన్యంబును సమ్మోహనాస్త్రంబునమూర్ఛితులంజేసి, సింహనాదంబుచేసిన, నాచిత్రరథుండు, వానిసాహసపరాక్రమంబులను, దివ్యాస్త్రప్రయోగనిపుణత్వంబును మెచ్చుకొనుచు, ధైర్యంబుదూలి, తనసైన్యంబులతోఁడఁ బరాఙ్ముఖుండయ్యె.

అంతనాశత్రుంజయుండు గంధర్వులు పరాజితులైరనిసంతసించి యాగ్రామంబునకుంజని యందలి కొలనులోదిగి స్నానంబాచరించి, తియ్యనిఫలంబులందిని, నీరుద్రావియాయాసంబుదీర్చుకొనుటకై యొక్కతమాలవృక్షంబుక్రిందఁగూర్చుండెను. ఇంతలోనాయుద్యానవనమంటపంబుననుండినస్త్రీలలోఁ గొందఱు ముందుగా హేమకాంతామణి పాలికింజని, యాసుందరీమణితో సర్వవృత్తాంతంబు నెఱిఁగింప, నానేపాళరాజతనయ యిన్నిదినంబులకుతననోముఫలించెనని సంతసించి, తానుపన్నీటజలకమాడి దివ్యవస్త్రాభరణభూషితురాలై, యాతనిరాకం బ్రతీక్షించుచుండెను. ఇటశత్రుంజయుండు కానుగుచెట్టుక్రిందనుండిలేచి, యాకొండగవినింజొచ్చిపోవుచు, నందలిమేడనవలోకించి దానిరమణీయతునకు నచ్చెరువందుచుంబోయి, యొకటిమంటపంబునంజొచ్చి, యదిమనోహరంబులగు నాలుగు

స్తంభంబులచేతను, శృంగారవతులగు నలుగురు సుందరులచేతనువెలుంగుచు, నామధ్యభాగంబున, పీతవర్ణంబై, షట్ఛతగోమేధికమణిమయంబై ప్రకాశించుపీటంబును గలిగియుండుటనుగని, యత్యానందంబునుంబొంది, యచ్చటిలలనామణులనవలోకించి, కాంతలారా, మీహేమకాంతామణియిందులేదాయనియడిగిన, నాకామరసాక్షు లిచ్చటలేదనిరి. అంతనారాజేంద్రుండామంటపంబునుగడచి, రెండవమంటపంబునకుంజని, యది యారుకంబములచేతను, నార్గురుసుందరీమణులచేతను నొప్పుచు నామధ్యభాగంబున శ్వేతవర్ణంబై, షట్సహస్ర హీరమణిఖచితంబైన యున్న కాసనంబుచే బ్రకాశించుటంగని, దానిశృంగారంబునుమదిమెచ్చుచు, నచ్చటిచేడియలంగని, యలివేణులారా, మీదేవి యిందులేదాయనియడిగిన, నాబిసరుహపత్రనేత్రలులేదనిరి. ఆరాజేంద్రుండామంటపంబునుగడచి, మూడవమంటపంబునకుంజని, యది దశస్తంభసి స్థితంబునుబదుగురునారీమణులచేశోభితంబునునగుచు, నామధ్యభాగంబున, రక్తవర్ణంబై, షట్సహస్ర పద్మరాగమణి ప్రభాభాసితంబైయుండు నొక్కపీఠంబునుగని, యచ్చోనుండు యువతీమణులం గాంచి, యోయిందుబింబాననలారా, ఇందుమీరాజపుత్రియున్నదాయనియడిగిన, నాకువలయనే

త్రలు, రాజోత్తమా, మాదేవిగారిందు లేదనినుడివిరి. ఆశత్రుంజయుండామంటపంబునుదాఁటి, నాలవమండపంబునకుంజని, యది ద్వాదశస్తంభంబులచేతను, బన్నిద్దరుకన్నియలచేతను గ్రాలుచు, నామధ్యభాగంబున, నీలవర్ణంబై షట్సహస్రంబులగు నీలంపుమణులచే సురుచిరంబగు నొకగద్దియుంగని దానిమనోజ్ఞతంబున కానందించుచు, నందున్నవారిజాత్కులంగని, మందయానలారా, యీదేవియిందున్నదాయనియడుగ, నాపల్లవపాణులు, రాజవర్యా, మారాజసుతయిందు లేదని చెప్పిరి. అంతనారాజసూనుఁడామండపంబును వీడి, యైదవమంటపంబునుం జేరి, యది పదియారుకంబములచేతను, షోడశకాంతలచేతను ప్రకాశింపుచు, నామధ్యభాగంబున, ధూమ్రవర్ణంబై యేకసహస్ర వైడూర్యమణివిలసితంబై యుండునొక్క యాసనంబునుంగని దానివర్ణసౌష్టవంబునకచ్చెరువంది, యందలిసుందరదనలంగని, యోకోమలులారా, యీహేమకాంతామణి యిందున్నదాయనియడిగిన, నాశుకవాణులు, మండలేశా, యాయండజయాన యిందులేదనిపలికిరి. ఆరాజేంద్రుండాచోటునువిడిచి, యారవమంటపంబునకుంబోయి, యది స్తంభద్వయంబుచేతను, నిరువురు సుందరలావణ్యయువతులచేతను వెలుఁగుచు, నామధ్యభాగంబున బంచరంగులుగలిగి,

యేకసహస్రనవరత్న సంఘటితంబై యుండు నొ
క్క-పీఠంబునుంగని దానిసౌందర్యంబును శ్లాఘిం
పుచునందలి చారువదనలంగని, యోభామలారా,
యిూరాజపుత్రి యెందున్నదనియడిగిన, నాచంద్ర
ముఖులు, రాజపురందరా,మాదేవి దీనికావలిమం
టపంబునమున్నదని చెప్పియొకసన్నత్రోవనుంజూపిం
చిన, నారాజేంద్రుఁడా మార్గంబుననేపోయి,యచ్చ
టగొప్పవెలుఁగునునావెలుఁగునంగన్పట్టుచేయికాళ్ల
మంటపంబునుంజూచి, యందు సర్వాలంకారభూ
షితయుఁ,జంద్రచ్ఛందమాలాలంకృతయుఁ, బీతాభ
దుకూలవస్త్రియునై సహస్ర సుందరీమణులచేఁ
బరివేష్టింపంబడి శుద్ధస్ఫటిక సింహాసనాధిష్టితయై
యుండు హేమకాంతామణింజూచి, యాకనకాంగి
సుందరంబున కచ్చెరువంది, మూర్ఛాపరవశుండై
నంగని, యారాజపుత్రితద్దయు సంభ్రమంబునదన
గద్దియనుండిడిగి, యాశత్రుంజయుని సమీపంబు
నకువచ్చి, గొజ్జఁగినీటనాతని మూర్ఛనుందెలిపి,
లోపలికి వెంటఁబెట్టుకొనిపోయి,తనపీఠంబుపైఁగూ
ర్చుండనియమించి, యిరువురుచెలికత్తియలను సుర
టీలువీవ, నొక్క-కంజనయననువింజామరంబువేయ
నియమించి,తానునొకగద్దియపైఁగూర్చుండి, యా
తనివృత్తాంతంబంతయువినంగోరిన, నతండిట్లనియె.
ఓసుకుమారగాత్రి, నేను గర్నాటకదేశంబును

నేలు సత్యాజిత్తనురాజేంద్రుని పుత్రుండను. శత్రుం
జయుండను పేరుగలవాఁడను. ముద్గలమహాఋషికి
శిష్యుండను. దేవేంద్రుని చే, ననేకదివ్యాస్త్రంబులఁ
గొనినవాఁడను. నాదేశంబునకుంబోవుచు నిటకు
వచ్చితి. నీవీయరణ్యంబున నిట్లుండుటకుఁ గారణం
బేమియెఱిఁగింపుమనిన, నారాజపుత్రి తనవృత్తాం
తమంతయును దెలిపి, సంతోషవార్తలాడుచుండ,
నంతరిక్షంబుననుండి కనకమణిమయంబగుపుష్పకం
బువచ్చుటంగని, చెలికత్తెలందఱు దేవేంద్రుండువ
చ్చుచున్నాఁడనితమదేవికిని వేదించిమఱుఁగుపడిరి.
అంత నాశత్రుంజయుండును, హేమకాంతామణి
యునులేచి, యాపాకశాసనునెదుర్కొని, యిరువు
రునతనికిదండప్రణామంబులుగావింప, నాసహస్రా
క్షుండు వారినిదీవించి, పుత్రికారత్నమా, అతుల
పరాక్రమసంపన్నుండును, మిక్కిలి జ్ఞానవంతుండు
నునగు, నీశత్రుంజయమహారాజునుబెండ్లియాడు
మని చెప్పి యంతర్ధానుండాయెను. అంతనాయిరు
వురునేకాంతంబున సల్లాపవార్తలాడుచు, నాశ
త్రుంజయుండు, యోచంద్రబింబాననా, నీసౌంద
ర్యంబునుంజూడఁజూడఁ నేఁజిన్ననాఁడు నారాయణ
శర్మయను విద్యాగురునిచేనేర్చిన ఛందోవృత్తంబు
లుతలంపునకు వచ్చుచున్నవనిననావనజగంధి, రాజ
పురందరా, నాకును ఛందోవ తంబులకును నేమి

సంబంధమనిన నతఁడిట్లనియె. ఓమదనదంతీ, నీకు రులంజూచిన, మేఘవిలసిత జలధరమాలావృత్తం బులు స్ఫురించెడిని. నీముఖపద్మముంగనిన, శశివదనాతామరసవృత్తంబులు తలంపునకు వచ్చుచున్నవి. నీనేత్రద్వయింగనిన, నారాచోత్పల మాలలుదోఁచెడిని. నీయోష్ఠంబుఁగనిన బింబబంధురంబులు జ్ఞప్తికిందగులుచున్నయవి. నీకంఠంబుంగనిన మత్తకోకిలాంబుజవృత్తంబులు మనంబుననాటుచున్నయవి. నీయురోజంబుల వీక్షించిన వనమంజరీధరణీధరవృత్తంబులు స్ఫురణకువచ్చుచున్నయవి. నీమధ్యభాగంబునుంజూడ, సింహరేఖాతనుమధ్యావృత్తంబులు జ్ఞాపకంబునకువచ్చుచున్నయవి. నీపిఱుందులంగనిన,పృథ్వీ వసుమతీవృత్తంబులు దోఁచుచున్నయవి. నీపదంబులంజూడ, సురలతాసుకాంతివృత్తంబులు మదింబొడముచున్నయవి. నీచారుహస్తంబులంజూడఁ బ్రభాకలితాంబురుహంబులు నాచిత్తంబునకుందగులుచున్నయవి. నీమేనిసౌష్టవంబుంగనిన, విద్యున్మాలాలలనగతి వృత్తంబులునామనంబున స్ఫురించుచున్నయవి. నీనగుమోముచంద్రికాకౌముదీవృత్తంబులఁ దోఁపించుచున్నయది. నీమందయానంబు మత్తేభవిక్రీడితగజవిలసితంబులఁబదేపదేజ్ఞాపకంబునకుఁదెచ్చుచున్నవి. కావున వృత్తంబులఛందంబులునీయందుబొందుపడియున్న

నిన, నాచంపకనాసిక, మిక్కిలిముదంబంది, యా
నింబెక్కువిధంబులఁగీర్తించెను. అట్టియెడ దిషా
రుండు, శత్రుంజయమహారాజు సుర్యాసురుల కజే
యుంబగు భూతంబునుఁజంపి, గంధర్వులనోడించి
ర్తివహించెననువార్త, నాగలోకవాసులకుంజెప్ప
ోయెనోయన, నపరాంబుధిం గ్రుంకెను. అత్తఱిని
మయంబనులలనామణి, జారిణివిధంబున నల్లచీర
ట్టెనోయన, నెల్లెడలఁజీకట్లుగలిగె. మఱియుశత్రుం
యహేమకాంతామణుల సంయోగంబునకుము
ంబంది, యమరకాంతలుచల్లినలాజలన, నచ్చట
చ్చట నక్షత్రంబులుపొడసూపె. అంతకైరవంబులు
కసింప, జార చోరులుభయంబంద, సముద్రుఁడు
ంతసిల్లఁతూర్పుదిక్కునచందురుండుదయింప, నెల్ల
మొడలవెన్నెలలుపిండియారఁబోసినట్లు కాయఁదొ
ంగెను. అట్టియెడఁగొందఱు చెలులువచ్చి భోజ
ముసిద్ధమైనదని చెప్పి, యాయిరువురం దోడ్కొని
ోయి వారికి మజ్జనభోజనంబులనొనరింపంజేసి,
వ్యవస్త్రాభరణంబులఁదొడఁగనిచ్చివారి నేకాంత
గృహాంబునకుంబంపిరి. అంత నాయిరువురు, సహ
సమణిదీపికాభాసురంబును, జిత్రచిత్ర విరాజితం
బును, సుగంధాగరుపరిమళద్రవ్య సంకలితంబును
గుదివ్యభవనంబుసొచ్చి యామధ్యభాగంబున,దివ్య
పభాభాసురంబై వెలుఁగు నవరత్నఖచితగలిగిన ప

ర్యంకంబునం బరుండి సుఖభోగంబులఁ దేలుచుండిరి.

అంత నీవృత్తాంతంబంతయు నేపాళదేశపుఁ బ్రభు వగు చంద్రశేఖరమహారాజు విని, యత్యంతసంతోషంబునఁ దన భార్యయగు శశిప్రభకు సావర్తమానమెఱిఁగించి, కొంతసైన్యంబుతోడ నా బిలంబు చెంతకుం బోయి, యందుఁ జచ్చిపడియున్న భూతంబునుం జూచి, భయాశ్చర్యములు గలవారై, రాజును, రాణియును, మంత్రియును బిలంబులోనికిం జొచ్చిరి. అంత నా శత్రుంజయుండును, హేమకాంతామణియును, వారికి నెదురుగాఁ బోయి, దోడ్కొని వచ్చి యుచితాసనంబులఁ గూర్చుండఁ బెట్టిరి. ఆ రాజతనయయుఁ దన తల్లిదండ్రులకు నా శత్రుంజయ మహారాజు వృత్తాంతంబంతయు నెఱింగింప, నా చంద్రశేఖరుండు శత్రుంజయుని నాలింగనము చేసికొని పెక్కువిధంబులఁ గీర్తించి, యందున్న వస్త్రాభరణంబులను వివిధరత్న సువర్ణవస్తువులను నెత్తించుకొని యల్లుని నొక సుత్తమాశ్వంబుపై నెక్కించి, తనపుత్రికారత్నంబును, ముత్యాలకుచ్చుల పల్లకిలోనం గూర్చుండఁ బెట్టి, యందఱును బ్రయాణమై నేపాళదేశంబునుం జేరిరి. తదనంతర మా దేశపు రాజపురోహితామాత్యప్రముఖులరావించి శుభముహూర్తంబు నిశ్చయించి, పురి నలంకరింపం జేసి, మంగళవాదంబుల మ్రోఁకొల్పించి యా శుభముహూర్తం

౦న దనపుత్రికిని శత్రుంజయమహారాజునకును వివా
౦మహోత్సవంబు గావించెను. ఇట్లా శత్రుంజయుం
౦ మామగారియింట మూడుమాసంబులు వివిధ
౦ఖానందములనుభవించుచుండి, పిమ్మటఁ దనజననీ
నకులంజూడఁగోరి, మామగారికిం దెలియపఱచిన,
ారాజేంద్రుఁడు తనపుత్రినింబాయని దొడ్డమో
౦ంబునఁ జింతాకులచిత్తుండై, యెట్టకేలకుఁదన
త్రిని నత్తగారియింటికిఁ బంపఁదలంచి చతురంగ
౦లంబులను, దాసదాసీజనంబులను, బల్లకీలను, నవ
త్నఖచితంబులగు వివిధవస్తువులనునిచ్చి యల్లుని
౦ంచకల్యాణియనుతురగంబుమీఁదను, పుత్రినిము
త్యాలకుచ్చుల పసిడిపల్లకిలోను గూర్చుండఁబెట్టి
ారికిసాహాయ్యంబుగఁదనదు సామంతులలో నిరు
ప్రరంబంపెను. ఆశత్రుంజయుండు సెలవుపొంది
ోవుచుఁ గొన్నిదినంబులకు తనపురప్రాంతంబున
జేరి, జననీజనకులకుఁదనరాక నెఱింగించెను. ఆసత్య
కన్యహారాజును నతనిపత్నియును, ప్రముదితస్వాం
తులై పోయి తమపుత్రునికోడలిని మంగళవాద్యం
బులును, భూసురాశీర్వాదనాదంబులును జెలఁగఁ జు
న్యాంగనలు మంగళంబులుపాడ, రాజమార్గంబునం
ొనివచ్చుచుండఁ, బౌరవధూజనంబు లిరువైపుల
మేడలపైఁ జేరి, పలుదెఱంగులమెచ్చుకొంచుచున్నా
[illegible] శత్రుంజయుండు

మంగళనాదంబులతోడనగరి మొగసాలఁ జేరనరిగి
యందు భార్యాసమేతుండై రథంబుదిగి, తనజననీ
జనకులకు నమస్కరించిన, వారాయిరువురనుదీవిం
చి, భూసంచారంబుఁ జేసి వచ్చినవర్తమానంబును,
గోడలివృత్తాంతమంతయునడిగి తెలిసికొని, యాము
ద్గలమహామునింగొనియాడి, వారినంతఃపురంబున
కుంబోవంబనిచెను. అనంతరమాసత్యజిన్మహారాజు
తనపుత్రునకుఁబట్టాభిషేక మహోత్సవంబుఁగావిం
పందలఁచి, శుభముహూర్తంబునిశ్చయించి, భర
ద్వాజముద్గలమహామునులరావించి, వారినినర్ఘ్య
పాద్యాదివిధులంబూజించి, తనదుద్యమంబువారికిం
జెప్పిన, వారుమిక్కిలి యానందంబునుబొంది, యా
శత్రుంజయమహారాజునకుఁబట్టాభిషేక మహో
త్సవంబునుగావించిరి.

ఆశత్రుంజయమహారాజు ధర్మయుక్తంబుగ రా
జ్యమునుబాలించుచుఁ గొన్నిదినంబులకు సకలరా
జన్యుల జయింపవలయుననుకోరికగలవాఁడై యమి
తసైన్యసన్నాహంబుగావించి, తల్లిదండ్రులయను
జ్ఞనుంబడసి, తనయత్తగురుఁడగు వీరవర్మనివెం
టఁగొని, మిత్రసామంతులతోడ బ్రయాణమైపోవు
చుండ నావీరవర్మండు శత్రుంజయునింజూచినాయ
నా, మనము సకలరాజన్యుల జయించుటకంటెను,
వీరందఱిచేఁ గట్నంబులఁగొను కోసలదేశాధీశుం

డగు చక్రవర్తి నిజయించిన మనకు సుకరంబుగనుం
డుననిన, నాశత్రుంజయుండునుసమ్మతించి, యయో
ధ్యాపురోన్ముఖుండై పోవుచు, తనరాకయుందత్కా
రణంబును వేగులవాండ్రచే నాచక్రవర్తి కెఱింగింప,
నాకోసలేంద్రుండునుయుద్ధసన్నద్ధంబుగావించుచుం
డెను. అట్టియెడ చిత్రసేనుండును గంధర్వుండుతన
నెయ్యుండగు భూలోకచక్రవర్తినింజూడవచ్చి, య
తనిసంగరప్రయత్నంబునుంగని, "మిత్రమా, నీవెవ
రిపైదాడికిసమకట్టెద" వనియడిగిన, నారాజరాజు,
"కర్ణాటదేశపురాజపుత్రుండగు శత్రుంజయుండు
యుద్ధంబునకువచ్చుచున్నాఁడనిన, నాచిత్రసేనుండి
ట్లనియె. చెలికాఁడా, యాశత్రుంజయుండుసామా
న్యుండుగాఁడు. అతఁడు సుత్రామప్రసాదంబునననే
కదివ్యాస్త్రంబులంబడసిన మహనీయుండు. మఱి
యునాతండు దివిజులకజేయుంబగు పెనుభూతంబు
నుంజంపి, నేపాళరాజసుతయగు హేమకాంతామ
ణినింబెండ్లియాడెను. నామిత్రుండునుగంధర్వరాజు
నునగు చిత్రరథుండాతనితోఁబోరాడిపరాభవంబు
నొందె. అనినవిని యాకోసలాధీశుండద్భుతచిత్తుం
డై, తనకునుసంతానములేకుండుటచేత, నాశత్రుం
జయునకే తనరాజ్యంబునియ్యఁదలంచి, యాతనికె
దురేగితోడ్కొనివచ్చి యాతని పరివారంబునకు
విడుదులనియమించి యెల్లరాజులరావించి, వారి

కంటజికి శత్రుంజయమహారాజు ధైర్యసాహసపరాక్రమంబుల నెఱుంగఁజెప్పి, కర్ణాటదేశాధీశునకు, హేమకాంతామణితోడ నందఱువచ్చునటుల శుభరేఖలనంపి, పురిశృంగారంబునుగావించుచుండెను. ఇంతలో నాసత్యజిన్మహారాజును, నాతనిభార్యయుఁ గోడలునువచ్చినవారినిసమర్యాదంబుగా గౌరవించి యొక్క శుభముహూర్తంబున మంగళవాద్యంబులను భోరుకొల్పించి భూసురశ్రేష్ఠులనురావించి యాశత్రుంజయ మహారాజునకు సామ్రాజ్యపట్టాభిషేక మహోత్సవంబుఁగావించెను. అంత నచ్చటిరాజులందఱు నతనికిదండప్రణామంబులాచరించి వారివారి దేశంబులకుంబోయిరి.

ఆశత్రుంజయమహారాజు కోసలదేశమునుబాలించుచుఁదనయస్త్రీగురుండగు వీరవర్మునుక్షత్రియుండగుటం జేసి కర్ణాటకదేశంబుఁ బరిపాలింపం బంపి, తనవిద్యాగురుండగు నారాయణశర్మకునసేకాగ్రహారంబులనొసంగి, బంధుమిత్రులపాలిటికల్పవృక్షంబై ధర్మయుక్తంబుగ బహుదినంబులురాజ్యమునుబాలించి, తుదకు నిర్వాణపదంబగుమోక్షంబునుంబొందెనని చెప్పిన, విని యాధర్మనందనుండు దేవస్థానమునీంద్రుని పాదంబులకెఱగి, మహాత్మా, మిక్కిలిపావనంబైన కథఁజెప్పితిరి. మిగులధన్యుండనైతిని. మీచే, రాజయోగపద్ధతులఁజక్కఁగాన

ఱుఁగుటచేత, నడవులకుంబోవలయుననుభ్రాంతిని విడిచితినని యాతనిం బెక్కువిధంబులఁ గీర్తించిన, నామునివరుండు, ధర్మతనయా, యీశత్రుంజయ మహారాజుచరిత్రమును జదువువారును, వ్రాయు వారును, వినువారునుబుణ్యలోకసుఖంబులనుభవిం తురనుటకుసందియంబు లేదు. గురుముఖంబున బ్ర హ్మజ్ఞాన చంద్రోదయంబునుంగనిన మహనీయులు నిర్వాణసుఖానుభవులగుదురని చెప్పి దీవించి, సెల వుపొంది తనయాశ్రమంబునకుంబోయెను.

గద్య॥ ఇది శ్రీమద్రమారమణచరణ సేవాముదితచారిత్రుం డును, సుధాకరవంశపయఃపారావారరాకాసుధాకరుండును, ఆత్రేయగోత్రపవిత్ర ఆదివెలమకుల ప్రసూనుండును, సకల నిగమాగమవేద్యుండును, అచలపరిపూర్ణుండునునగు పోకల-శేషాచలమునాయునివారి సుపుత్రుండునునగు, పోకల-వేంకట నరసింహారావునాయనిచే రచియింపఁబడిన, బ్రహ్మజ్ఞానచంద్రో దయంబను శత్రుంజయమహారాజ చరిత్రంబు సర్వంబును, పంచమాశ్వాసము.

సంపూర్ణము.

---

